# విషయసూచిక



# భారతప్రధాని
# పండిత జవహర్లాల్ నెహ్రూ

---

## 1. నెహ్రూవంశము

భారతదేశపు టుత్తరదిశయందు హిమాలయమను నగాధిరాజము పంక్తులుదీరి వ్యాపించియున్నది. హిమవత్పర్వత ప్రాంతమునకు వాయువ్యభాగమున కాశ్మీరదేశము కలదు. కాశ్మీరదేశపు ప్రకృతి రామణీయకత యసాధారణమైనట్లే యందలి జనుల రూపలావణ్యములును ననన్యసామాన్యములు. కాశ్మీరవాసుల శరీరకాంతియు, విశాలవక్షములును, దీర్ఘ బాహువులును, స్ఫురన్నేత్రములును వారి విశుద్ధమగు నార్య జాతిని చెప్పకయే చెప్పుచుండును. భూలోకస్వర్గమని పేరు గాంచిన కాశ్మీరదేశము నెహ్రూవంశమునకు జన్మస్థలము.

మొగలాయి సామ్రాజ్యము వినాశ మొందినతోడనే అనగా నిప్పటికి రమారమి రెండువందల యేండ్ల క్రిందట దేశమునందలి ఉత్తర భాగములతోపాటు కాశ్మీరము నందును నశాంతియు నాందోళనమును ప్రబలెను. అందుచే గొందఱు గృహస్థులా ప్రాంతమును వదలవలసివచ్చెను. అట్టివారిలో రాజకౌలు అను బ్రాహ్మణకుటుంబీకు డొకడు యమునానదీ తీరమునగల ఢిల్లీనగరమును జేరి యచట వృత్తిఖ్యాతులు సముపార్జించెను. అప్పటి ఢిల్లీపాదుషా రాజకౌలును తన

గా

దర్బారుపండితునిగ గ్రహించి యాతనికొక జాగీరును, యమునానది కాలువయొడ్డున నొక గృహమును బహుమతిగ నిచ్చెను. పాదుషా కుటుంబమునందలి వారికి రాజకౌలు సంస్కృతమును, పారసీకభాషయును బోధించుచుండెను.

హిందీభాషలో కాలువకు 'నహర్' అందురు. రాజకౌలు కుటుంబమును ఇరుగుపొరుగువారు "కౌలునహర్"అని పిలుచుట వాడుకయయ్యెను. కాలక్రమమున నా వంశమునకు 'నహర్' అను నామకరణముగల్గి 'నహర్' 'నెహ్రూగ'గ మార్పుజెందుట తటస్థించెను.

రాజకౌలునకు ప్రపౌత్రుడగు లక్ష్మీనారాయణనెహ్రూ ఢిల్లీపట్టణమున బ్రిటిషుతూర్పుయిండియా సంఘపు ప్రభుత్వమునకు వకీలుగఁ బనిచేసెను. లక్ష్మీనారాయణుని పుత్రుడగు గంగాధరనెహ్రూ ఢిల్లీనగరపు 'కొత్వాలు' పదవిని నిర్వహించెను.

ఇట్లుండగా 1857వ సంవత్సరమున మనదేశమందు సిపాయీల యుద్ధ మారంభమయ్యెను, ఢిల్లీకూడ ఆ యుద్ధ కేంద్రములలో నొకటియగుటచే నచట నల్లకల్లోల మేర్పడెను. అంతట మరికొందరితోఁబాటు గంగాధరనెహ్రూ ఢిల్లీని వదలి ఆగ్రానగరముఁజేరెను. 1861వ సంవత్సరమున తన ముప్పది నాల్గవయేట గంగాధరనెహ్రూ కాలధర్మము నొందెను. ఆయన కప్పటి కిద్దరు కుమారులు నిద్దరు కుమార్తెలు నుండిరి. పిదప మూడు నెలలకు అనగా 6-5-1861 తేదీన అతనిభార్యను మరియొక పుత్రుడుద యించెను. ఈతడే మోతీలాల్ నెహ్రూ.

గంగాధరుని జ్యేష్ఠతనయుఁడు వంశీధరుఁడు. రెండవ వాఁడు నందలాలు. వీరిద్దరును పారసీ, ఆంగ్లభాషల నభ్యసించిరి. వంశీధరుఁడు న్యాయశాఖోద్యోగియై గ్రామాంతరములందు కాలక్షేపము చేయుచుండెను. నందలాలు ఆగ్రా నగరముననే యుద్యోగము సంపాదించి కుటుంబపోషణము చేయుచుండెను.

ఆగ్రాకు పడమటిదిక్కున ఖేత్రియను చిన్న సంస్థానముండెను. కాలక్రమమున నందలాలు ఖేత్రీసంస్థానమున నుద్యోగియయ్యెను. ఖేత్రి యరణ్యప్రాంతము; బందిపోటు దొంగతన మచట మిక్కుటముగ నుండెను. సహజధీరుఁడగు నందలాలు బందిపోటుదొంగలను వేఁటాడి వారి నాయకుని స్వయముగాఁ బట్టుకొని యా సంస్థానమున శాంతిభద్రతలఁ గాపాడెను. అచిరకాలముననె ప్రతిభాశాలియగు నందలాలు ఖేత్రి సంస్థానమునకు దివానుగ నియమితుఁ డయ్యెను. ఇట్టి స్థితిలో ఖేత్రి ప్రభువగు ఫతేసింహుఁడు 1870వ సంవత్సరమున సంతానరహితుఁడై మరణించెను. అతనికి దగ్గరబంధువును, అనంతరవారసుఁడునగు అజితసింహుని ఖేత్రి రాజుగ ప్రజాసమ్మతితో నందలాలు ప్రకటించి పట్టాభిషేకము జరపెను.

అంతట, స్వదేశరాజును నియమించు నధికారము తనకేగాని దీవానునకు లేదని యచటి బ్రిటిషు రెసిడెంటు ప్రకటించి, తన యనుమతి లేకుండ ప్రవర్తించినందులకు దివానును తొలగింపవలెనని యా ఆంగ్లోద్యోగి పట్టుబట్టెను. ఇట్టి విషమపరిస్థితులలో నా స్వదేశరాజ్యమున నుండుట భావ్యముకాదని నిశ్చయించుకొని 1871వ సంవత్సరమున నందలాలు తిరిగి ఆగ్రాను చేరెను. ఆ నగరమున నప్పుడుండిన హైకోర్టులో నంద

లాలు మొదట ననువాదకర్త (ప్లీడరుగా)గ నుండి క్రమముగ న్యాయశాస్త్రపరీక్షయందు కృతార్థుడై న్యాయవాదవృత్తి నవలంబించెను. ఇంతలో హైకోర్టు అలహాబాదునకు మార్పుటచే నందలాలు సకుటుంబముగ ప్రయాగక్షేత్రమునుజేరి యనతికాలముననె తనవృత్తియందు పేరుప్రతిష్ఠలగడించెను.

---

## 2. మోతీలాలు నెహ్రూ

నందలాలు నెహ్రూ ఖేత్రి సంస్థానమున నున్న కాలమున నతని యనుజుడగు మోతీలాలు బాల్యదశయందుండెను. మోతీలాలు చిన్నప్పటినుండియు సాహసవంతుడుగను, ధైర్యశాలిగను నుండెను. ఖేత్రి అరణ్యములలో నచటి సర్దారులతో దిరుగుచుండుటచే స్వేచ్ఛాజీవనమున కలవాటుపడెను; కాని యతడు స్వతస్సిద్ధముగ సూక్ష్మబుద్ధిగలవాడగుటవలన పారసీ, అరబ్బీ, హిందూస్థాని భాషలనుకూడ నభ్యసింపగల్గెను.

నందలాలు ఆగ్రాకు తిరిగివచ్చుసరికి **మోతీలాలు**నకు పండ్రెండేండ్లు వయస్సుండెను. అప్పటినుండి యతడు చాకచక్యముతో విద్యనభ్యసించి మరి నాలుగేండ్లలో ఎంట్రెన్సు పరీక్షలో కృతార్థుడయ్యెను. 1877 వ సంవత్సరమున నన్నతో మోతీలాలు అలహాబాదు వచ్చి యచటి ప్రభుత్వ కళాశాలలో బి. ఏ. తరగతివరకు జదివెను. విద్యార్థిదశలో మోతీలాలు అల్లరిజట్టునకు నాయకుడుగ నుండెను; కాని

యితని స్వతంత్రబుద్ధిని ప్రతిభను కనిపెట్టి కళాశాలాధ్యక్షుం డగు (ప్రిన్సిపాలు) హారిసను మోతీలాలును మిగుల నాదరింపం దొడంగెను.

పట్టపరీక్షకు హాజరగుటకై మోతీలాలు ఆగ్రాకు వెడలెను. మొదటి దినమున జరిగిన పరీక్షాపత్రమున కతండు సమాధానము వ్రాసెనుగాని యతనికది తృప్తికరముగ లేకుండెను, అందుచే మిగిలిన పరీక్షలకు వెళ్ళుటమాని, ఆగ్రానగరమందలి సుందరభవనములగు తాజుమహాలు, జుమ్మామసీదు మున్నగువానిని సందర్శించుచు మోతీలాలు కాలము వెళ్ళంబుచ్చెను. అందుచే నతండు పట్టపరీక్షయం దుత్తీర్ణత నొందలేకపోయెను. ఆ కాలమున బి. ఏ. పట్టము లేనివారు గూడ న్యాయవాదపరీక్షకు చదువవచ్చును. అందుచే మోతీలాలు న్యాయశాస్త్రము నభ్యసించి 1884వ సంవత్సరమున న్యాయవాదిపరీక్షయందు ప్రథమశ్రేణిలోం గృతార్థత నొందగల్గెను. నియమానుసారముగా మోతీలాలు కాన్పూరు జిల్లాకోర్టులో రెండేండ్లు న్యాయవాదిగం బనిచేసిన పిదప అలహాబాదు హైకోర్టులో నగ్రజుడగు నందలాలునకు సహకారిగ వకీలువృత్తి నవలంబించెను.

పిమ్మట గొలంది నెలలకే 1877 వ సంవత్సరమున హఠాత్తుగ నందలాలు స్వర్గస్థుడగుట తటస్థించుటచే వృత్తి నిర్వాహరణభారమునకుం దోడు కుటుంబభారముగూడ మోతీలాలు భుజస్కంధముల పైంబడెను. కాని మోతీలాలు అకుంఠిత ధైర్యముతోను, అచంచలోత్సాహముతోను వృత్తిధర్మముల నెరవేర్చుచు నహోరాత్రములు శ్రమపడుచున నతి కాలముననే

న్యాయవాదులలోఁ బ్రఖ్యాతుఁడను యశస్సు నార్జింపఁ గల్గెను. యువకుఁడయ్యును కక్షిదారులకు మిగుల తృప్తికరముగ, బనిచేయుచుండుటచే వకీలులు మోతీలాలుచేతనే తమ వ్యవహారములు నడిపింపసాగిరి. ఇంతలో నందలాలునకు మిత్రుఁడును, సుప్రసిద్ధ న్యాయవాదియు నగు కాల్విను ఆకాలమున నడచుచుండిన యొక పెద్దవ్యాపారపు లెక్కల వ్యాజ్యములోఁ బనిచేయుచు సగములో వదలుకొనఁగా మోతీలాలు ఆ వ్యవహారమును చేఁబట్టి మిగుల శ్రద్ధతో కృషిచేసి తాను యువకుఁడయ్యు నున్నత న్యాయస్థానమున ధైర్యస్థైర్యములతో స్వాయముగనే వాదించి యందు విజయము నందెను. వృత్తి నవలంబించుట కారంభదశయందే యంతటి ప్రజ్ఞావిశేషములఁ బ్రదర్శించిన మోతీలాలు ప్రతిభను న్యాయాధిపతులుకూడ వేనోళ్ళ నుగడించిరి. అట్టి సుప్రసిద్ధివలన భాగ్యశాలురగు వర్తకులును జమీందార్లును చాలమంది మోతీలాలునకే తమ వ్యాపారము లధీనమొనర్పసాగిరి. ఇట్లు కొలదికాలముననే మోతీలాలు ప్రముఖుఁడగు న్యాయవాదియును ఖ్యాతినొందెను. ఖ్యాతితోఁబాటు ధనాదాయమును విస్తరించెను.

వకీలువృత్తి నారంభించిన కొలఁదియేండ్లలోనే మోతీలాలు సంవత్సరమునను నాలుగైదు లక్షల రూపాయలరాబడిని పొందుచుండెను. అంతట మోతీలాలు 1899 వ సంవత్సరమున ఆనందభవనము అనుపేర విఖ్యాతినొందిన సువిశాల హర్మ్యమును నిర్మించెను. ఆనందభవనము నిర్మింపఁబడిన స్థలము పురాణప్రసిద్ధమైనది. శ్రీరాముఁడరణ్యవాసమునుండి

తిరిగివచ్చినపుడు భరతుండు శ్రీరామునితో సమావేశము జరిపిన స్థలమదియే యని విఖ్యాతి. భరద్వాజాశ్రమమచటికి సమీపమునందే యుండెను. పూర్వకాలమున నచట నొక విశ్వవిద్యా పరిషత్తుగూడ నుండెను.

ఆనందభవనము విశాలమగు ప్రాంగణములతోను విస్తీర్ణమగు గదులతోను గూడియుండెను. ఆ భవనము చుట్టును నొక పెద్దతోటయుండెను. ఆ యావరణయందే యొక టెన్నిసు ఆటస్థలమును ఒక వేసవి విడిదియును నిర్మింపబడె. ఈ వేసవి విడిదిలో నొక రాతిగుట్టపై నొక శివలింగమమర్చబడెను. శివుని శిరోభాగమునుండి రాతిగుట్ట యడుగునన్న కాసారములోనికి ఆకాశగంగవలె జలధార నిరంతరము ప్రవహించుచుండెను.

ఆనందభవనప్రాంగణమున నెన్నియో గుఱ్ఱపుసాలలుండెను. మోటారులకును, గుఱ్ఱపుబండ్లనుంచుటకు నెన్నియో గదులు కట్టబడియుండెను.

ఆ భవనమునకు చేరువనే యొక కొలను నేర్పరుపబడెను. వినోదమున క్రీడుటకై అలహాబాదునగరమందలి మోతీలాలుమిత్రులు తరచుగ నచటికి కేతెంచుచుండిరి. ఏలయన ఆ నగరమున ఈతకొలను నిర్మింపబడుట కదియే యారంభము.

విద్యుద్దీపములు వెలుగుటకును నలహాబాదు నగరమున ఆనందభవనముననే ఆరంభము.

అలహాబాదునగరమున సొంతముగ బైసికిలు కొనుటలోను, మోటారుకారు కొనుటలోనుగూడ మోతీలాలుదే మొదటిచేయి.

ఆ నగరమున మోతీలాలునకు కొందరో గొప్ప అధికార పదవులలోనున్నవారును, భాగ్యవంతులునగు మిత్రులు లుండిరి. వారి నందరిని ఆనందభవనమున కాహ్వానించి మోతీలాలు తరచుగ విందులు చేయుచుండెను. అతిథులతోడను, మిత్రుల తోడను మిగుల నుల్లాసముతో మోతీలాలు సంభాషించు చుండగా నానందభవనము వారి పరిహాసోక్తులచేఁ బ్రతిధ్వనించుచుయథార్థముగ ఆనందమునకు భవనముగనే యుండెను. ఇట్లు మోతీలాలు రాజఠీవితోను, ఇంద్రవిభవముతోను తన జీవితమును గడుపుచుండెను.

సాంఘికవిషయములలో మోతీలాలు సంస్కారి. ఇతర హిందూస్త్రీల ఆచారములకు భిన్నముగ తన గృహమందలి స్త్రీలు ఘోషాపద్ధతి పాటింప నవసరము లేదని యాతఁడు నిర్ణయించెను. వారిని మోటారుకారులలో షికారునకు తీసికొని పోవుచుండెను. ఇగ్లండు వెళ్ళివచ్చి తాను ప్రాయశ్చిత్తము చేసికొనకపోవుటయేగాక విదేశములనుండి తిరిగివచ్చిన యువకులను ప్రాయశ్చిత్తము చేసికొనవద్దని మోతీలాలు ప్రేరేపించెను. హిందు ముస్లిం భేదములను పాటించుట ఆయన కభ్యాసము లేదు. ముబారక్ అలీ అను ముస్లిం యువకునికి పనినేర్పి తన గుమాస్తాగ నేర్పరచుకొనెను. ప్రజాహిత కార్యములందు పాల్గొని మోతీలాలు సాంఘిక మైత్రిని పెంపొందింప యత్నించుచుండెను. కాంగ్రెసు సమావేశముల కేటటను మోతీలాలు పోవుచుండెను. గాని యచటి కార్యక్రమమున నెక్కువగ పాల్గొనుట లేదు.

మోతీలాలునకు ఆత్మగౌరవమును, జాతియభిమానమును చాల యెక్కువగనుండెను. అలహాబాదు హైకోర్టులో భారతీయ న్యాయాధిపతి యొకఁడె యుండగా మోతీలాలు పట్టుబట్టి భారతీయుల నెక్కువగ నియమించునట్లు ప్రభుత్వముచే జేయించెను. మోతీలాలు రాష్ట్రశాసనసభలోఁ గొంతకాలము సభ్యుఁడుగా నుండగా అప్పటి గవర్నరు భారతీయులను తూలనాడెనని మోతీలాలు తత్క్షణమే శాసనసభ్యత్వమునకు రాజీనామా నిచ్చెను.

---

### 3. జవహర్లాలు జననము - బాల్యము

మోతీలాలు నెహ్రూభార్య స్వరూపరాణి. ఆమె సుస్థిరద్రూపి, దయార్ద్రహృదయురాలు, ఉదారశీల. ఈ దంపతుల కేకపుత్త్రుఁడును మొదటి సంతానము నగు జవహర్లాలు అలహాబాదునందు 14-11-1889 వ తేదీని జనన మందెను. అంతట మోతీలాలు వేలకొలది బీదల కన్నవస్త్రములు దానముచేసి పుత్రోత్సవముచేసెను. తమ గృహాముున కలంకారప్రాయమగు నా శిశువునకు తలిదండ్రులు 'జవహర్లాల్' అని నామకరణము చేసిరి. 'జౌహర్' అను పదము అరబ్బీభాషనుండి జవాహర్ అని హిందీలోనికి మారెనది. 'అలంకారము' అని ఆ పదమున కర్థము. జవహర్లాలు అనుపేరాబాలునకు సార్థకనామమేయైనది. ఏలయున నతఁడు పెరిగి పెద్దవాఁడైన పిదప దమ గృహామునకేగాక, స్వదేశమునకును, లోకమున కంతటకునుగూడ భూషణమే యయ్యెను.

జవహర్లాలు శుక్లపక్ష క్షపాకరునివలె దినదినప్రవర్ధమానుఁడై యుల్లాసముగఁ బెరిగెను. జననీజనకు లిద్దరును దమ ముద్దుకుమారుని మిగుల గారాబముతోఁ జూచుచుండిరి. ఏలయన జవహర్లాలునకుఁ బదునొకండేండ్లు వచ్చువరకును వారి కతఁ డేకసంతానమై యుండెను. కాని మోతీలాలు మాత్రము పుత్త్రుని ముద్దుగాఁ జూచుటకుఁ గొడుకు క్రమశిక్షణలో నుంచుట యందును వెనుదీయుట లేదు. మోతీలాలున కొక్కొకప్పుడు స్వాభావసిద్ధముగ విపరీతమగు కోపము కల్గుచుండెను. స్వతస్సిద్ధముగ నాతఁడు సౌమ్యుఁడును, దయాళువును నైనను కోపము కల్గినపుడుమాత్రము రుద్రునివలె భయంకరుఁడుగ గన్పట్టుచుండెను.

జవహర్లాలున కైదేండ్లవయస్సున నొక దినమున నాతఁడు జనకున కాగ్రహము కల్గించుపని యొకటి చేసెను. ఆ దినములలో ఫౌంటెనుకలములు మన దేశమున క్రొత్తగా దిగుచుండెను. రెండు ఫౌంటెనుకలములను మోతీలాలు కొని వానిని కడుజాగరూకతతో వాడుచుండెను. అవి కంటఁబడినపుడెల్ల జవహర్లాలు వానిలో నొకటి తాను తీసికొనవలెనని యువ్విళ్ళూరుచుండెను. ఒక దినమున నవి మేజాబల్లపై నుండగా జవహర్లాలు చూచి యవి రెండును తండ్రిగారి కవసర ముండదు గనుక తానొకటి తీసికొనవచ్చునని తలఁచి, యొక కలమును సంగ్రహించెను. పిదపఁ గొంతసేపటికి మోతీలాలు ఆ కలముకొర కిల్లంతయు వెదుకగా తుదకు యథార్థము బయటపడెను. అంతట మోతీలాలు ఆగ్రహపరవశుడై కుమారుని మితిమీరిన దెబ్బలఁ గొట్టెను. సుకుమార

శరీరుఁడగు నాబాలుని దేహమంతయు కందిపోయెను. కాని యంతటిలోనే నవనీతమువలె మృదువైన మోతీలాలు మనస్సు కరిగి, పుత్త్రుని చేరఁదీసి, యతని యొడలికి నుపచారముచేయఁ దొడగెను.

మోతీలాలు కుమారుని విద్యాభ్యాసమునకై బడికి పంపక ఇంటివద్దనే చదువు చెప్పించుచుండెను. ఒక మున్షీ ప్రతిదినమును వచ్చి హిందూస్థానీపాఠములును, కథలును చెప్పుచుండెను. 1857వ సంవత్సరమున మన దేశమున జరిగిన సిపాయిల యుద్ధవీరుల గాథలు మున్షీ చెప్పుచుండగా విని జవహర్లాలు వారిపౌరుషమునకును ధైర్యమునకును ఉప్పొంగుచుండెను. మున్షీ అరేబియన్ నైట్సుకథలు చెప్పగా విని యందలి యద్భుతచర్యలకు జవహర్లా లానందపరవశుఁడగుచుండెను.

జవహర్లాలునకు పదునొకండేడ్లు వచ్చినపిదపనె అతని చెల్లెలు విజయలక్ష్మి జన్మించెను. అంతవరకును అతనితో నాడుకొనుటకును మాటలాడుటకును దగిన సమవయస్కు లింటి యం దెవరును లేరు. కాని జవహర్లాలునకు వినోదముల కెట్టి లోపమును లేకుండెను. మోతీలాలు మహావిభవసంపన్నుఁడు. అలహాబాదునగరమునకు వచ్చిన ఆ కాలపు క్రొత్తవస్తువుల నెల్ల నతడు కొనుచుండెను. జవహర్లాలునకు స్వారిచేయుటకు బైసికిలుండెను. ప్రశస్తమగు గుఱ్ఱములుండెను. జవహర్లాలు తన ప్రియతమమగు నశ్వమునకు 'రష్' అని పేరిడి మిగుల నుత్సాహముతో దాని నధిరోహించుచుండెను.

జవహర్లాలునకును అతని చెల్లెండ్రగు విజయలక్ష్మికిని, కృష్ణకునుగూడ బాల్యమునుండియు గుఱ్ఱపుస్వారియం దమిత ప్రీతి "జవహరును, స్వరూపయును (విజయలక్ష్మి), నేనును, నడకయు గుఱ్ఱపుస్వారిగూడ నించుమించుగ నొకే పర్యాయము నేర్చుకొంటిమి, గుఱ్ఱపుస్వారియనిన మాకంత ప్రీతి" అని జవహర్లాలు రెండవచెల్లెలు కృష్ణ ఒకచోట వ్రాసియుండెను. మోతీలాలు ఆనందభవనపు ఆవరణలో ఈతకు అనువగు తటాకము నేర్పాటుచేసెను. మధ్యాహ్నం వేళలందు జవహర్లాలు ఆ తటాకములో తరచుగ నీదుచుండెను.

ఆంగ్లేయులగు దాదులవద్ద కొంత చదువు నేర్చుకొనిన పిదప పండ్రెండేండ్లవయస్సు వచ్చుసరికి జవహర్లాలున కాంగ్ల విద్య నేర్చుటకు ఎఫ్. టి. బ్రూక్సు అనునాంగ్లేయు డుపాధ్యాయుడుగ నియమింపబడెను. ఈయన దివ్యజ్ఞాన ప్రచారకుడు, గొప్ప జ్ఞాని. ఆంగ్లసాహిత్యమునేగాక, ప్రకృతిశాస్త్రమును, ఉపనిషత్తులను, భగవద్గీతను, ధర్మపదమును, గ్రహతత్త్వ గ్రంథములనుకూడ నాయన జవహర్లాలుచే చదివించుచు. ఆ సమయముననే ఒక పండితునివద్ద జవహర్లాలు కొంత సంస్కృత భాషకూడ నభ్యసించెను.

బాల్యమునుండియు జవహర్లాలునకు వార్తాపత్రికలు చదివి ప్రపంచవార్తలు తెలిసికొను నభ్యాసముండెను. తమ స్వాతంత్ర్యముకొరకే దేశపుప్రజలైన పోరాడిరని తెలిసికొనినపుడు జవహర్లాలు మహానందమును పొందుచుండెను.

---

## 4. విదేశవిద్య

పదునైదేండ్లవరకును జవహరు విద్యాభ్యాసమింటివద్దనే నడచెను. అంతట నతఁ డున్నతవిద్య నభ్యసించు సమయ మాసన్న మయ్యెను. పరాధీనమున నుండిన మనదేశమునందలి కళాశాలలందుకంటె స్వతంత్ర పరిపాలనగల ఇంగ్లండునందలి విశ్వకళాపరిషత్తులలో విజ్ఞాన సముపార్జనమున కెక్కువ యవకాశము లుండుననియు, ప్రజ్ఞావంతులును, కార్యశూరులు నగు నాంగ్లేయుల సాహచర్యము భావిజీవితమున తన కుమారున కెక్కువ యుపకరించుననియు మోతీలా లాశించెను.

అట్టియుద్దేశ్యముతో 1905వ సంవత్సరము మే నెలలో మోతీలాలు సకుటుంబముగ ఆంగ్లదేశమునకు వెడలి కుమారుఁడగు జవహర్లాలును హారో పట్టణమందలి పబ్లికుస్కూలులో ప్రవేశపెట్టి, కొన్ని నెలలు యూరపుయాత్ర జరపి స్వదేశమునకుఁ దిరిగివచ్చెను. హారో పబ్లికుస్కూలునందు గొప్ప విద్వాంసులగు నుపాధ్యాయు లుందురు. ఆంగ్లవిద్యతోఁబాటు ఆంగ్లసాంప్రదాయములును ఆంగ్లసంఘ మర్యాదలు నచట నేర్పబడును. కాని బహుధనాఢ్యులకు మాత్రమే యాసంస్థయందు విద్యాభ్యాసము సుసాధ్యమగును. జవహరు హారోయం దుండిన సమయమున బరోడా, కపుర్తాలా మున్నగు స్వదేశ సంస్థాన ప్రభుకుమారులుగూడ నచట విద్యగఱపుచుండిరి.

హారో పాఠశాలయందు జవహర్లాలు లాటిను, ఫ్రెంచి భాషల నభ్యసించుటయేగాక వార్తాపత్రికలు చదివి లోక వ్యవహారము లవగాహనము చేసికొనుచు, ఆర్థిక రాజకీయ

సమస్యల గ్రహించుచు, వాని మూలసూత్రములఁ దెల్పు గ్రంథసముదాయమునుఁ గూడ పఠించుచుండెను. జవహర్లాలు హారోయందుఁ జదువుచున్నకాలమున బ్రిటిషుపార్లమెంటున కెన్నికలు జరిగెను. అందు లిబరలు పక్షమువారు (ఉదారాశయములు గల రాజకీయపక్షము) విజయమంది కన్సర్వేటివులు (పూర్వాచారపరాయణులు) ఓడిపోయిరి. ఈ సంఘటనము జవహర్లాలున కమితోత్సాహము కలిగించెను. ఒకదినమున హారో స్కూలునందలి యుపాధ్యాయు లొకరు జవహర్లాలు చదువుచున్న తరగతిలోని బాలురను ఇంగ్లాండునందు నూతనముగ నేర్పడిన మంత్రివర్గపు సభ్యుల పేర్లనుఁ దెల్పుడని ప్రశ్నింపఁగా నాంగ్లవిద్యార్థులెవరును సరియగు సమాధానమీయలేకపోయిరి. కాని జవహర్లాలు మంత్రులందరి పేర్లను క్రమముగా దెల్పుటయేగాక, ఒక్కొక మంత్రియును పాలించు ప్రభుత్వశాఖలనుఁ గూడ వివరముగఁ బేర్కొనెను.

జవహర్లాలు హారోయందుండిన కాలమున ఇటలీ, ఐర్లండు మున్నగు దేశములలోని ప్రజలు విదేశపాలననుండి విముక్తినొందుటకై స్వాతంత్ర్యసమరములు సాగించుచుండిరి. జవహర్లాలు శ్రద్ధతో వాని పోకడలు గమనించుచుండెను. అది యట్లుండ, మన మాతృదేశమగు భారతభూమియందుఁ గూడ వందేమాతర మను జాతీయోద్యమము విజృంభించుచుండెను. విదేశపరిపాలనక్రింద ఆర్థికముగ కుంగి కృశించుచున్న మనదేశమునకు స్వరాజ్యమే విముక్తి సాధనమనియు, అందులకు స్వదేశి, విదేశవస్తుబహిష్కారము, జాతీయవిద్య — అనునవి ముఖ్యసాధనములనియు భారతజాతీయ పితామహుఁ

డగు దాదాభాయి నౌరోజి 1906 వ సంవత్సరమున కలకత్తా కాంగ్రెసు అధ్యక్షపీఠమునుండి యెలుగెత్తి చాటెను. శ్రీ బిపినచంద్రపాలు, శ్రీ లాలాలజపతిరాయి, శ్రీ లోకమాన్య బాలగంగాధర తిలకు మున్నగు జాతీయనాయకులు నౌరోజీ సూత్రములను దేశమంతటను ప్రచారముచేయుచుండిరి. ఈ విషయములన్నియు జవహర్లాలు ఇంగ్లండునందలి వార్తాపత్రికలలో జదువుచుండెను.

ఆ కాలమున జరిగిన మరియొక ముఖ్యసంఘటన జవహర్లాలున కెక్కువ యుత్సాహము గలుటకుఁ గారణభూతమయ్యెను. ఏలనన నా సమయమందే ప్రాచ్యదేశమగు జపాను పాశ్చాత్యపద్ధతుల ననుసరించి యచిరకాలమున నభివృద్ధిజెంది బలవంతమగు ఐరోపా రాజ్యమైన రష్యానోడించి ఐరోపా రాజ్యములతో సమాన ప్రతిపత్తిని బొందఁగల్గెను.

ఉన్నత పాఠశాలావిద్యను పూర్తిజేసికొని జవహర్లాలు కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయమున ట్రినిటీ కళాశాలయందుఁ జేరి రసాయన శాస్త్రము, భూతత్వశాస్త్రము, వృక్షశాస్త్రము అను మూడింటిని నభిమానవిద్యలుగఁ గైకొని ట్రైపసు అను నుత్తమశ్రేణినిఁ బొంది ఎం., ఎ, పట్టమునుఁ బడసెను. ఇది గొప్ప ప్రతిభావంతులకే సాధ్యమగు విషయము. కళాశాల విద్యతోఁబాటు ఆంగ్లవాఙ్మయ విశేషములను, రాజ్యాంగ తత్త్వమును పూర్తిగ గ్రహించుటయందు జవహర్లాలు తన కాలము నెక్కువగ వినియోగించుచుండెను.

పిదప తన కుమారుని ఐ. సి. యస్. పరీక్షకుఁ జదివింపవలెనని మోతిలాలున కుద్దేశ్యముండెను. కాని ఐ. సి. యస్.

పరీక్షయందు కృతార్థతనొంది బ్రిటిషువారి కొలువులోఁ జేరుట జవహర్లాలునకు రుచింపలేదు. ఐ. సి. యస్. పరీక్షకు జదివినచో ప్రభుత్వపు టుద్యోగమునఁ జేరి తరచుగ దూరదేశములకు బదిలీలను పొందవలసివచ్చునుగనుక తన యేకపుత్రుని విడిచియుండవలసివచ్చునని మోతీలాలు మనసునకు బిదపఁ దట్టుటచే జవహర్లాలును బారిష్టరుపరీక్షకుఁ జదివించుటకే నిశ్చయించుకొనెను. అంతట జవహర్లాలు 'ఇన్నర్ టెంపిలు' లోఁ జేరి శ్రద్ధగ న్యాయశాస్త్రము నభ్యసింపఁదొడఁగెను. ఆ కాలమున నచటనే ఖాన్‌సాహెబు, సేన్‌గుప్త, కిచ్లూ మొదలగు వారును బారిష్టరుతరగతిలోఁ జదువుచుండిరి. డాక్టరు అన్సారి ఇంగ్లండున వైద్యోద్యోగిగ నుండెను. జవహర్లాలునకు వీరందరితోడను నచట మైత్రి యేర్పడెను.

ఇంగ్లండుననున్న దినములలో జవహర్లాలు తన కాలమంతయు గ్రంథపఠనమునందే వెళ్ళబుచ్చక, ఇతర విధముల గూడ విజ్ఞానవిస్తరణ జేసికొని ప్రపంచానుభవము సంపాదించుట కనేకవిధముల యత్నించెను. ఒకసారి శెలవుదినములలో నతఁడు జర్మనీ ముఖ్యపట్టణమగు బెర్లిను సందర్శించెను. అదే సమయమున నచట కౌంటుజెపలిన్ అను వైజ్ఞానికుఁడు మొట్టమొదటసారిగ విమానయాత్ర జరుపుచుండెను. జర్మను చక్రవర్తియగు కెయిజరుగూడ ఆయుత్సవమునఁ బాల్గొనెను. జవహర్లాలును నత్యుత్సాహముతో నా యుత్సవానందము ననుభవించెను. అచట సమావేశమైన వారందరకును కౌంటు జెపెలిన్ చిత్తరువులను బహుమానముగ నొసఁగబడెను.

జవహర్లాలునకు లభించిన చిత్తరువులను నతఁడింకను భద్రపరచియున్నాఁడు.

మరియొకసారి జవహర్లాలొక యాంగ్లమిత్రునితో పర్వతమయమగు నార్వే దేశమున సంచారముచేయుటకు వెడలెను. చాలదూరము నడచుటచే నలసిపోయి వారిద్దరును తుదకొక హోటలును చేరి స్నానమునకు జలము కావలెనని కోరిరి. స్నానమున కేర్పాట్లచట లభింపవనియు వారికంతఁగా శరీర క్షాళనము జేసికొనవలెనని కోర్కెయున్నచో సమీపముననే గల సెలయేటికిఁ బోవచ్చుననియు నాభోజనశాల యజమాని సమాధాన మిచ్చెను. ఒక హిమానీనదమునుండి హోరుమను ధ్వనితో దిగువ కురుకుచున్న యొక జలప్రవాహము వారి కనతిదూరముననే కంటబడెను. వెంటనే జవహర్లాలా ప్రవాహమున దుమికెను. ప్రమాదవశమున నతని కాలు జారగా నా మంచునీటియందలి విపరీతశైత్యముచే నతని శరీరము కొయ్యబారిపోవుటయేగాక నతఁడు ప్రవాహము వెంబడి వడిగా కొట్టుకొని పోవుచుండెను. తీరమున నతని మిత్రుఁడు గట్టువెంబడి పరుగెత్తి జవహర్లాలు కాలందుకొని యొడ్డునకీడ్చెను. అచటికి కొలఁది గజములదూరముననే యా ప్రవాహమొక గుట్టపై నుఁడి క్రిందకురుకుటచే నొక జలపాత మేర్పడియున్నదని తర్వాత జవహర్లాలు, నతనిమిత్రుఁడును చూచిరి. ఎంత సూక్ష్మములోఁ దనకు గండము తప్పెనో జవహర్లా లపుడు గ్రహింపగలైను.

జవహర్లాలు పాశ్చాత్యదేశములం దున్నకాలమున వృత్తివిద్యతోఁబాటు పాశ్చాత్యసంఘపు సద్గుణములను,

మర్యాదలను గూడ నలవరచుకొనుచు తనశీలమును, వ్యక్తిత్వమును సర్వదా గాపాడుకొనుచు, సామ్యవాదము మొదలగు సామాజికసిద్ధాంతములందుఁ దగిన పరిజ్ఞానమునొంది లోకానుభవము నార్జించి జాతీయభావ సంపూర్ణుఁడై 1921వ సంవత్సరమున బారిష్టరుపట్టము నొంది గృహోన్ముఖుఁడయ్యెను.



## 5. స్వదేశాగమనము

తమ యేకపుత్త్రుఁడగు జవహర్లాలు ఏడునిమిదేండ్లు విదేశమున విద్యాభ్యాసమును ముగించుకొని స్వగృహమునకుఁ దిరిగివచ్చు సమయమున సహజముగఁ దలిదండ్రుల యుత్సాహము వెల్లివిరియుచుండెనని వేరుగఁ జెప్ప నవసరము లేదు. పండిత మోతీలాలు నెహ్రూయును, స్వరూపరాణియుకుమారుఁడగు జవహర్లాలు కొఱకు చంద్రకాంతికై చకోరపక్షుల వలె యెదురు జూచుచుండిరి. జవహర్లా లింటికి వచ్చునని తెలియుట తోడనే కొన్ని నెలల ముందునుండియు నతని కుచితరీతిని స్వాగత మొసఁగుటకు జననీజనకులు తగు సన్నాహముఁజేయ సాగిరి. అందును తల్లియొక్క సంతోషాతిశయమిట్టిదని వర్ణింప నలవిగాకుండెను. రోజంతయు నామె యటునిటు గృహము నందు దిరుగాడుచు తన ప్రేమపాత్రుఁడగు పుత్త్రుఁడిల్లు జేరుసరికి ఆతని యానందానుభూతికి ఎట్టిలోపమును లేకుండ జూచుటకై నెంతయో తాపత్రయము పొందుచుండెను.

అది గ్రీష్మర్తువు. నెహ్రూకుటుంబమువా రాసమయమున కాశ్మీరమందలి మసూ్సరీకొండ విడిదిపై నుండిరి. ఎంత కాలమునుండియో అత్యాతురతతో పుత్త్రుని గృహాభిగమనమునకై స్వరూపరాణి నిరీక్షించుచున్న యా సుదిన ముదయించెను. గుఱ్ఱపుడెక్కల శబ్దము వినిపించగనే స్వరూపరాణియు, కుమార్తెలగు విజయలక్ష్మియు, కృష్ణయును ద్వారమువద్దకుఁ బరువులిడుచుఁ బోయిరి. జవహర్లా లశ్వారూఢుడై యరుదెంచి, హయము దిగినవెంటనే తల్లినాలింగనమొనర్చుకొనెను. వెంటనే సిగ్గుతో ప్రక్కను నిలుచుండిన తన నైదేండ్ల ముద్దుచెల్లెలగు కృష్ణను చేతులార నెత్తుకొనెను. పిదపఁ గొంతకాలము నెహ్రూకుటుంబమువారు మసూ్సరీయందు గడపి అలహాబాదును చేరిరి.

అప్పటికి పండిత మోతీలాలు నెహ్రూ ప్రముఖుడగు న్యాయవాదియని ప్రఖ్యాతి జెందియుండుటచే నాయనకుఁ జేతినిండ పనియుండెను. జమీందార్లు, వ్యాపారస్తులు, రయితులు ఇట్టి ధనికవర్గమునకుఁజెందినవారెందరో మోతీలాలు నెహ్రూ చేతులందుఁ దమ వ్యవహారముల నుంచుచుండిరి. బారిష్టరు పట్టము బొందివచ్చిన జవహర్లాలు న్యాయవాదవృత్తినిర్వహణములందు జనకునకుఁ దోడ్పాటొనర్చుచు నెనిమిదేండ్లు గడపెను. ఆ సమయమందున్నతన్యాయస్థానములో నెన్నియో కేసులను జవహర్లాలు ప్రజ్ఞతో నడపెను. మేధావియు, కార్యశూరుఁడును, సహృదయుఁడు నగు జవహర్లాలు శ్రద్ధతోఁ గృషియొనర్చి యచిరకాలముననే తన వృత్తియందు పేరు ప్రతిష్ఠలఁ బొందఁగల్గెను.

కాని జవహర్లాలు హృదయము న్యాయవాదవృత్తి యందు నిమగ్నముకాలేదు. జీవితమున ధనార్జన మొక ప్రధానాశయముగ నతఁడు పరిగణింపలేదు, జవహర్లాలు మానసక్షేత్రమున జాతీయతాబీజము బాల్యముననే నాటుకొని కాలము గడచినకొలదియు మొలకలెత్తి దినదినప్రవర్ధమాన మగుచుండెను. వకీలువృత్తి ధనార్జనమునకే యుపయోగించును గాని, ప్రజాసామాన్యము నున్నతపథమునకుఁ దేఁగలిగిన యత్యవసరసమస్య లేమియు నావృత్తి పరిష్కరింపఁజాలదని జవహర్లాలు విశ్వసించెను. మన మాతృదేశపు దాస్యవిముక్తికిఁ దదేకదీక్షతో సంఘసేవ యొనర్చుటయం దాసక్తిగలవా రెందరో కావలసియున్నారని యతఁడు తలచుటచేఁ దనకాలములో నధికభాగము ప్రజాసేవకే వినియోగించుటకే జవహర్లాలు కృతనిశ్చయుఁడయ్యెను.



## 6. వివాహము – కాశ్మీరయాత్ర

1916వ సంవత్సరమున జవహర్లాలు వివాహమహోత్సవము జరిగెను. ఢిల్లీనగరనివాసియగు జవహర్లాలు కౌలు అను నతని యేకపుత్రికయగు కమల పెండ్లికుమార్తె. తమ యేక పుత్త్రుఁడగు జవహర్లాలు వివాహమును అట్టహాసముతో జరుపుటకు పండిత మోతీలాలు, స్వరూపరాణియు నెలలదరబడి ప్రయత్నములు చేయుచుండిరి. ఆ శుభకార్యము ఢిల్లీనగర

ములో జరుపుటకు నిశ్చయింపబడెను. సుముహూర్తన కొక వారము ముందుగనే పెండ్లివా రొక శుభదినమున అలహాబాదునుండి ప్రత్యేకముగ నేర్పాటుచేయబడిన రైలుబండిలో బయులుదేరిరి. మోతీలాలుపండితుడు నూర్గురాప్తబంధుమిత్రులతో ఢిల్లీకిబయునమయ్యెను. ఢిల్లీనగరమున నింకను ఎందరో బంధువులు పెండ్లి రిని కలసికొనిరి. వారందరికిని నెన్నియుండ్లనను విడిదులను చాలవను నుద్దేశముతో మోతీలాలు బంధువుల బసలకు ప్రత్యేకముగా గుడారములను వేయించెను. ఇట్లు తాత్కాలికముగ ఢిల్లీలో నేర్పడిన చిన్నవలసకు 'నెహ్రూ వివాహపు విడిస' అని పేరుగల్గెను. పరిణయముజరిగిన పది దినములవరకును ఢిల్లీనగరమున విందులు గుడిచినపిదప పెండ్లివారు నూతనవధువుతోగూడ అలహాబాదునకుఁ దిరిగివచ్చిరి.

వివాహముజరిగిన కొలది దినములలోనే జవహర్లాలు భార్యాసమేతుడై కాశ్మీరుయాత్ర చేసెను. ప్రకృతిరామణీయకత కాటపట్టగు కాశ్మీరమునఁ దన పత్నియగు కమల నొక గ్రామమున విడిచి, భూలోకస్వర్గ మనబడు ఆ ప్రాంతమందలి సృష్టివిచిత్రములఁ బరికరించుచు జవహర్లాలు ఒకమిత్రునితోఁ గూడహిమాద్రిశిఖరములనధిరోహించుటకుఁబయునమయ్యెను. సృష్టిసౌందర్యముచే నాకృష్టులయిన జవహర్లాలును నతని సహచరుడును, పదునారువేల యడుగులయెత్తునందు సునామాసముగ నెక్కఁగల్గిరి. ఆ నగరమున కావలి ప్రక్క 'అమరనాథగుహ' యను సుప్రసిద్ధమగు ప్రదేశము గలదు. అచటికెట్లయినను చేరవలెనని జవహర్లాలు నిశ్చయించుకొనెను. మంచుగడ్డ

లపై బాకుచు, జారుచు, పడుచు, లేచుచు నెట్టెట్లో ఆహారము విశ్రాంతియు లేక ఆ గుహను సమీపించు నంతలో జవహర్లాలు కాలిక్రిందనున్న హిమపాషాణము సడలెను. అంతట నాతఁడొక యగాధములోఁబడిపోయి ప్రమాదావస్థలోఁజిక్కెను. పర్వతము లెక్కువారు జాగ్రత్తకొఱకు ఒక త్రాటిని నడుము నకుఁ గట్టుకొందురు. మిత్రుఁడు ఆ త్రాటిని బట్టుకొని పైకి లాగగా జవహర్లాలు సురక్షితముగా బయటకు వచ్చెను.

ఇట్టి సాహసకృత్యములయందు జవహర్లాలునకు బాల్యమునుండియు నాసక్తిమెండు. విద్యార్థిదశలో నార్వే యందుఁ దటస్థించిన ప్రమాదమునుగూర్చి యిదివరలోఁదెలిసి కొనియున్నాముగదా!

పుణ్యదంపతులగు జవహర్లాలు కమలానెహ్రూలకు 1917 వ సంవత్సరమున ఇందిర యను నొక పుత్రిక జన్మించె.

---

## 7. భారత రాజకీయములు

190౦ వ సంవత్సరమునుండి మనదేశమున నడచిన జాతీయోద్యమము (వందేమాతరం) నకు ఫలితముగ మనదేశ నాయకులు రెండుపక్షములుగ చీలిపోయిరి. ఫిరోజిషా మెహతా, గోపాలకృష్ణగోఖలె, శ్రీనివాసశాస్త్రి మున్నగువారి ఉద్దేశ్య మేమనగా – బ్రిటీషుప్రభుత్వమువారికి మన కోర్కెలను విన్నపము మూలమునఁ దెలియఁజేసి వారు మన కెంతవరకు పరిపాలనయందు సౌకర్యములొసర్చెదరో వానిని మనము

స్వీకరించి, ఇంకను కావలసినవానికొఱకు బ్రిటిషు ప్రభుత్వమును మన మర్థింపవలసియుండును. ఇట్టి యభిప్రాయములుగల నాయకులకు మితవాదులని పేరువచ్చెను. వారవలంబించు విధానమునకు మితవాద తత్త్వమని పేరు.

మరికొందరు నాయకుల యుద్దేశ్యము వేరువిధముగ నుండెను. "మనము బ్రిటిషువారిని మన హక్కులకొరకు యాచించుట కూడనిపని, స్వరాజ్యము మన జన్మహక్కు. కనుక బ్రిటిషువారితో పోరాడియైనను మనదేశపు పరిపాలనను మనము చేబట్టవలెను. ఇట్టి తత్త్వము నవలంబించిన నాయకులు లోకమాన్య బాలగంగాధరతిలక్, లాలాలజపతిరాయ్, బిపినచంద్రపాల్ మొదలగువారు, వారిని "అతివాదులు" అని కొందరనసాగిరి.

1907 వ సంవత్సరమున సూరత్ నగరమున జరిగిన కాంగ్రెసు సమావేశములో మితవాదులకును అతివాదులకును సంఘర్షణకలిగి కాంగ్రెసునందు రెండుపక్షము లేర్పడెను.

1909 వ సంవత్సరమున బ్రిటిషుప్రభుత్వమువారు మన దేశమునకొన్ని రాజకీయసంస్కరణముల నమలు చేసిరి. వీని వలన భారతీయులలో కొలదిమందికి కొన్ని క్రొత్త ఉద్యోగములును, పదవులును లభించుటకవకాశ మేర్పడెను. మితవాదులు ఆయుద్యోగములకును, పదవులకును వ్యామోహము చెంది బ్రిటిషుప్రభుత్వముతో నెక్కువ సహకారము చేయు నారంభించిరి. ఈ యుద్యోగములును, పదవులును కొలదిమంది వ్యక్తులకు లాభము కల్గింపవచ్చునుగాని, విదేశప్రభుత్వము క్రిందదినదినమును కుంగిపోవుచున్న భారతదేశదాస్యవిముక్తి

కిసుమంతయు నవి ప్రయోజనకరము కావని అతివాదులు ఘోషింపసాగిరి.

1912 వ సంవత్సరమున పాట్నాయందు జరిగిన కాంగ్రెసు సమావేశమునకు జవహర్లాలు హాజరయ్యెను.

ఇంతలో దక్షిణాఫ్రికా భారతీయులసమస్య తీవ్ర రూపముదాల్చెను. దక్షిణాఫ్రికా ఐరోపీయుల వలసరాజ్యము. బ్రిటిషుసామ్రాజ్యములోఁ జేరిన స్వపరిపాలనగల ప్రాంతము. కొందరు వ్యాపారముకొఱకును, మరికొందరు కూలిపనుల మీఁదను ఇట్లు వేర్వేరు వృత్తులవలంబించుటకై దక్షిణాఫ్రికా యందు మనదేశపు ప్రజలు స్థిరపడిరి. శ్వేతవర్ణులగు ఐరోపీయులు అచ్చటి భారతీయులను హీనముగఁ జూచి మనవారి కవమానకరమగు నిర్బంధముల నెన్నిఁటినో శాసనరూపమున అమలుజరుపఁదొడఁగిరి. అట్టిసమయమున నప్పటికి బారిష్టరుగ నుండిన గాంధిమహాత్ముఁడు చటకు వృత్తిధర్మము ననుసరించి వెడలుట తటస్థించెను. దక్షిణాఫ్రికాయందలి మన దేశీయుల యగచాట్లుగాంచి మహాత్ముఁడనుభవపూర్వకముగ గ్రహింపఁగలైను. రైలుప్రయాణమునందాయన యొకపర్యాయము మొదటి తరగతి టిక్కెట్టు కొనినను గూడ ఆయనను మొదటి తరగతిపెట్టెలోఁ బ్రయాణము చేయకుండ ఐరోపీయులగు ప్రయాణీకు లాటంకపరచిరి. రైలుపెట్టునుండి క్రిందకు దింపి వేసిరి. రైల్వేఉద్యోగులుగూడ నాక్లిష్టపరిస్థితిలో గాంధిగారికి మొదటితరగతిలోఁ బ్రయాణముచేయుటకుఁ గల హక్కును సమర్థింపలేకపోయిరి. ఇట్టి యవమానము లెన్నియో దక్షిణాఫ్రికాభారతీయు లనుభవింపవలసియుండెను. ఇందులకు, గాంధ

ణము ప్రధానముగ మన మాతృదేశము పరాధీనమగు ప్రభుత్వమున నుండుటయే యని వేరుగ వక్కాణింప నవసరము లేదు.

అచటి భారతీయుల హక్కులను నిలఁబెట్టుటకై గాంధీ మహాత్ముఁడు దక్షిణాఫ్రికాయందే స్థిరనివాస మేర్పరచుకొని 1913 వ సంవత్సరమున సత్యాగ్రహోద్యమము నడుప నారంభించెను. ఆ సమయమున మన దేశీయులు ధనరూపముగను ఇతరవిధములను దక్షిణాఫ్రికాభారతీయులకుఁ దోడ్పడవలసిన యవసరము గల్గెను. జాతీయభావ ప్రేరితుఁడగు జవహార్లాలు ఆ యదనున మనదేశమందలి ప్రజలు చేయవలసిన సహాయమునుఁగూర్చి ప్రబోధమొనరించి సంయుక్తరాష్ట్ర ప్రాంతములలోనే బదివేల రూప్యములను చందా ప్రోగుచేసి గాంధిమహాత్మునకుఁ బంపెను. సత్యాగ్రహోద్యమ విజయమునకీ ధనసహాయ మెంతయో యుపకరించెను.

---

## 8. దేశసేవాసంకల్పము

19'4 వ సంవత్సరమున జర్మనీరాజ్యముతో బ్రిటను మొదలగు దేశములకు మొదటిప్రపంచయుద్ధ మారంభమయ్యెను. ప్రపంచమందలి వివిధదేశములలోని ప్రజల అభీష్టము ననుసరించియే అచటి పరిపాలన జరుగునట్లు చూచుటకై నిరంకుశపరిపాలన తొలగించుటకొరకు ఆయుద్ధమును జరుపుచున్నామని బ్రిటిషు రాజనీతిజ్ఞులు చాటఁదొడఁగిరి. కష్ట

సమయమున బ్రిటిషువారికి మనస్ఫూర్తిగ భారతీయులు తోడ్పడవలెనని గాంధిమహాత్ముండు బోధించెను. మన దేశపు స్వపరిపాలన విషయమై బ్రిటిషువారు స్పష్టముగ నభిప్రాయము వెలిబుచ్చిననేగాని మనము తోడ్పడరాదని తిలక్ మొదలగు నాయకు లుద్దేశించిరి. 1916 వ సంవత్సరమునతిలక్‌ను, అనీ బిసెంటును 'హోంరూలు' (స్వపరిపాలన) ఉద్యమము నారంభించిరి. హోంరూలులీగునకు జవహర్లాలు కొంతకాలము కార్యదర్శిగ పనిచేసెను. ఆ మరుచటివత్సరము ఆగష్టునూడవ తేదీని భారతరాజ్యాంగ కార్యదర్శి (సెక్రటరీ అఫ్ స్టేట్సు) యగు మాంటాగూ ఒకప్రకటన చేసెను. 'భారతదేశమున క్రమక్రమముగా బాధ్యతాయుతపరిపాలన స్థాపించుటయే బ్రిటిషువారి ఆశయ'మని ఆప్రకటన సారాంశము.

ఇంతలో 1918 వ సంవత్సరమున యుద్ధము ముగిసెను. యుద్ధకాలమున ప్రపంచమందలి వివిధరంగములలో మన దేశపు సైనికు లెందరో పాల్గొనిరి. ధనవంతులు విరాళముల నొసంగిరి. యుద్ధనిర్వహణమున భారతీయులు చూపిన సహకార భావమునకు ప్రతిఫలముగ బ్రిటిషువారు మన దేశీయులను మన దేశపు పరిపాలనలో కొంతవరకు భాగస్వాములుగా నొనర్తురని మన ప్రజ లాశించుచుండిరి.

ఇట్లుండగా 1919వ సంవత్సరమున బ్రిటిషు ప్రభుత్వము వారు ఒక సంస్కరణ శాసనమును చేసిరి. దీనినిబట్టి కొన్ని రాజ్యీయసంబంధమగు మార్పులు మన దేశ పరిపాలనలో ప్రవేశపెట్టుట కుద్దేశింపబడెను. ఈ మార్పులనుబట్టి శాసన

సభలలో ప్రజాప్రతినిధులసంఖ్య వృద్ధియైనది; ప్రజలచే నెన్నుకొనఁబడిన మంత్రులయధీనమునఁ గొన్ని ప్రభుత్వశాఖ లుంచబడినవి. కాని గవర్నరుజనరలునకును, గవర్నరులకును ప్రజాప్రతినిధులు చేయు శాసనములను రద్దుచేయుటకు ప్రత్యేకాధికారము లుండుటచే ఈసంస్కరణములు నేతిబీరకాయవంటివే యని జాతీయనాయకులు నిర్ణయించిరి. పండిత మోతీలాలుగారు లక్నోలో ఆసంవత్సరము జరిగిన రాష్ట్రీయ రాజకీయమహాసభ కధ్యక్షత వహించి పై యభిప్రాయమునే ప్రకటించిరి.

జవహర్లాలు మనదేశపు రాజకీయపరిస్థితులను గమనించినకొలఁదియు బ్రిటిషువారిని యాచించువిధానముగల మితవాదతత్వ మెంతమాత్రమును ఆయనకు రుచింపలేదు. జాతీయవాదనాయకులగు తిలకు మొదలగువారైనను తాత్కాలికముగ తీవ్రములగు నుపన్యాసముల నిచ్చుటయేగాని స్థిరమగు ప్రణాళిక నేదియు నవలంబించుట లేదు. ఇట్టిస్థితిలో సంవత్సరముపొడవునను నెడతెగక స్థిరమగు క్రియారూపము దాల్చు రాజకీయ కార్యక్రమము నవలంబించుటయే స్వదేశ దాస్యవిముక్తికి సాధనమని జవహర్లాలు విశ్వసించుచుండెను.

పండిత మోతీలాలు నెహ్రూకూడ స్వతంత్రభావమును గలిగియుండెను. రాజకీయ సంస్కరణమునకై బ్రిటిషువారిని యాచించుట ఆయనకును ఇష్టమగు పనిగాదు. గాని తీవ్ర రాజకీయములలోఁ బాల్గొని వకీలువృత్తికి భంగకరముగ వర్తించుట ఆయన యుద్దేశ్యముగాదు. ఆయనకు ఐరోపీయులలోను ప్రభుత్వపు ఉన్నతోద్యోగులలోను ఎందరో మిత్రు లుండిరి.

వారితో విలాసముగఁ గాలము వెళ్ళబుచ్చుట పండిత మోతీలాలున కభ్యాసమయ్యెను. అందుచేనిర్భయముగ స్వతంత్రాభిప్రాయములఁ బ్రకటించు శక్తిసామర్థ్యము లాయనకున్నను రాజకీయాందోళనమును సునిశితముగాని చురుకుగాని ఆయన తత్త్వమున కప్పటికింకను సరిపడ లేదు.

తండ్రిగారి దృష్టి నెట్లయినను జాతీయకార్యక్రమములపై నెక్కువగ మరల్చి, ఆయనప్రతిభను, పలుకుబడిని దేశసౌభాగ్యమున కెక్కువగ వినియోగించునట్లు చేయవలెనని జవహర్లాలువ్విళ్ళూరుచుండెను. తరచుగ జనకునితో రాజకీయములఁ గూర్చి జవహర్లాలు చర్చించుచుండెను. తనకు దేశసేవాభిలాష యెంత యెక్కువగ నున్నను, తన్నతి గారాబముగఁ బెంచి పెద్ద వానిఁజేసి భావిజీవితమున తన్నె నమ్ముకొనియున్న తండ్రి మాట కెదురాడుట కాతఁడు వెనుదీయుచుండెను.

---

## 9. ఇండిపెండెంటు పత్రిక

1919 సంవత్సరమున బ్రిటిష్షు ప్రభుత్వము ప్రచురించిన సంస్కరణప్రణాళికను జూచినప్పటినుండియు పండిత మోతీలాలు రాజకీయభావము అంతకంతకు తీవ్రము కాఁజొచ్చెను. జవహర్లాలు అదివరకే జాతీయనిర్మాణ కార్యక్రమమును బూనుటకుఁ గృతనిశ్చయుఁడై యుండెను. జాతీయ కార్యక్రమమునకుఁ బునాది ప్రజలలో తగు విధమున ప్రబోధము కల్గించుటయే యని జవహర్లాలు గ్రహించెను. ప్రజా

ప్రబోధమునకు వార్తాపత్రికలే ముఖ్యసాధనమనియు నతఁడు గుర్తెరిఁగి యుండెను.

ఆ కాలమున విద్యయందును, జాతీయభావములు గలిగి యుండుటలోను జవహర్లాలు జన్మించిన రాష్ట్రమగు సంయుక్త ప్రాంతము, బెంగాలు, బొంబాయి, మదరాసు మున్నగు రాజధానులకంటె వెనుకఁబడి యుండెను. అప్పటికి అలహాబాదులో 'పయొనీరు', 'లీడరు' అను ఆంగ్లదినపత్రిక లుండెను. పయొనీరు ఆంగ్లేయులది. కాని లీడరుపత్రిక భారతీయులచే నడుపబడుచున్నను మితవాదశ్రేణికిఁ జెందినది. ఈ పత్రిక జాతీయప్రవృత్తి కలిగియుండలేదు; జాతీయవార్తలకుఁ బ్రాధాన్య మొసఁగుట లేదు. చాకచక్యముతోఁగూడిన జాతీయభావప్రేరణయే ప్రధానాశయముగాఁ గల దినపత్రికను అలహాబాదులో స్థాపించవలసిన ఆవశ్యకతను తండ్రికి నచ్చచెప్పి, అట్టిపత్రికను నడుపుట కాయనచే జవహర్లా లొప్పించెను.

దినపత్రికలు నిర్వహించుట యనేకములగు చిక్కులతోఁ గూడినపని. ముఖ్యముగ నది విశేషద్రవ్యసాధ్యము, అనుభవశాలురగు పనివార లెందఱో తోడ్పాటు కావలసి యుండును. విశేషముగ బుద్ధికుశలత కావలెను; జాతీయభావపూరితము లగు పత్రికలకు మరియొక ప్రమాదముగూడ నుండెను. బ్రిటిషు ప్రభుత్వము వారు జాతీయపత్రికలపై నెల్లప్పుడును ఒక కన్ను వైచియుంచి, యేమాత్రము అనుమానము కలిగినను అపరాధముక్రింద విశేషముగ ధనమును వసూలు చేయుచుండిరి.

ఇట్టి పరిస్థితు లన్నియు తెలిసియుండియు పండిత మోతీలాలును, జవహర్లాలును అలహాబాదులో 'ఇండిపెండెంటు

(స్వతంత్ర) అను పేరుతో 1919 సంవత్సరారంభమున నొక దినపత్రికను ప్రకటింప నారంభించిరి. వాటాదార్లతోఁ గూడిన లిమిటెడ్ కంపెనీ నేర్పరచి ఆ కంపెనీపేరను ఇండిపెండెంటు పత్రిక స్థాపింపఁబడెను. వాటాలలోఁ జాల యెక్కువ భాగమును నెహ్రూ కుటుంబమువారే కొనిరి. అందుచే వారిధనమే ఆ పత్రికానిర్వాహణమునకు ప్రధానముగు మూలద్రవ్యమయ్యెను. జవహర్లాలు ఆకంపెనీ డైరెక్టరులలో నొకఁడుగ నుండి ఆర్థికవ్యవహారములు చక్కఁబెట్టుచుండెను. అంతేగాక తరచుగ నా పత్రికలో ఉజ్వలశైలితో దేశీయసమస్యలఁ జర్చించుచు నుత్తేజకములగు వ్యాసములు వ్రాయుచుండెను. బ్రిటిషుప్రభుత్వపు అక్రమచర్యలు ఇండిపెండెంటు పత్రికలో మొగమోటములేక విమర్శింపఁబడుచుండెను. ప్రతిభావంతులగు సంపాదకులను యుక్తమగు వేతనముపై డైరెక్టరులు నియమించుచుండిరి. ఈకారణములచే ననతికాలముననే దేశీయ పత్రికలలో ఇండిపెండెంటు అగ్రస్థానమును పొందగల్గెను. దేశమందు నలుమూలలను ఇండిపెండెంటు పత్రిక వలన స్వరాజ్యసంపాదనాశయపు బీజములు వెదజల్లఁబడెను. అంతట రాజద్రోహకరమగు వ్యాసము లాపత్రికయందు ప్రకటింపఁబడెనను నెపముతో బ్రిటిషుప్రభుత్వమువారు ఇండిపెండెంటుపత్రికానిర్వాహకుఁడగు జవహర్లాలుమీదను, సంపాదకునిమీదను నభియోగము తెచ్చిరి. కాని జవహర్లాలుపై నేరము ఋజువుకాలేదు. సంపాదకునికి ప్రభుత్వమువారు కారాగారవాసశిక్ష విధించిరి. వెంటనే మరియొక సంపాదకు డేర్పడెను. 1919 వ సంవత్సరమునుండి 1923 వ సంవత్సరము

వరకు ఇండిపెండెంటుపత్రిక చాల జయప్రదముగ నడచి దేశమందు రాజకీయ ప్రచారమునకు విశేషముగ సహాకరించెను. కాని యటుపిమ్మట మనదేశముననే ముఖ్యముగ నెహ్రూ కుటుంబమునను ఏర్పడిన క్లిష్టపరిస్థితుల ఫలితముగ నాపత్రిక నిలచిపోవుట సంభవించెను.

---

## 10. పంజాబు దురంతములు

మొదటి ప్రపంచ యుద్ధానంతరము బ్రిటిషు ప్రభుత్వమువారు మనదేశమునం బ్రవేశపెట్టదలచిన రాజకీయ సంస్కరణములు కేవలము ఆడంబరముతోం గూడియుండెను. శాసనసభలలో సభ్యులసంఖ్య పెరిగెను. శాసనసభలసంఖ్య వృద్ధియయ్యెను. ఉద్యోగము లెక్కువగా సృష్టింపబడెను. రాష్ట్రపరిపాలనలో ద్వంద్వప్రభుత్వ మేర్పరుపంబడెను. అధికారశూన్యములగు మంత్రిపదవులు రాష్ట్రములలో సృజింపంబడెను. కాని గవర్నరుజనరలునకును, గవర్నరునకును నిరంకుశాధికారము లొసంగబడెను.

ఈసంస్కరణములు పై మెఱుగునకు భ్రాంతిపడియు, పదవీవ్యామోహముచేతను మితవాదు లుబ్బితబ్బిబ్బులగుచుండిరి. కాని జాతీయవాదులు కాంగ్రెసు సమావేశము జరిపి ఈ సంస్కరణములు అసమగ్రములు, అసంతృప్తికరములు, ఆశాభంగకరములు నని తీర్మానించిరి. దక్షిణాఫ్రికాలో సత్యాగ్రహము జరిపి విజయ మొందిన గాంధీమహాత్ముడు యుద్ధసమ

యమున బ్రిటిషువారికిఁ దోడ్పడియు ఈ సంస్కరణముల ప్రణాళిక చూచినమీఁదటఁ బ్రిటిషువారియందు విశ్వాసము గోల్పోయెను. స్వయంకృషిచే స్వరాజ్యము సంపాదించుటయే కర్తవ్యమనియు అందులకు సత్యాగ్రహమే సాధనమనియు గాంధిమహాత్ముఁడు ప్రకటించి దీక్షతోఁ గూడిన కార్యక్రమము నడుపుటకు సత్యాగ్రహసభల నేర్పరుపఁ దొడఁగెను.

ఈ పరిస్థితులన్నియు గమనించి బ్రిటిషుప్రభుత్వమువారొకవైపున మితవాదులను జేరఁదీయుచు, మరియొకప్రక్క జాతీయవాదుల నణఁచుటకై 'రౌలటుశాసనములు' అను కఠినమగు చట్టము లమలుజరుపఁ దలఁచుచుండిరి. కేవలము అనుమానముమీఁదనే ఏ వ్యక్తినైనను అవధిలేక నిర్బంధించుటకు ప్రభుత్వమువారి శాసనములవలన నధికారము బొందిరి.

రౌలటు శాసనములు ఘోరమైనవిగనుక వాని షరతుల నుల్లంఘించి జెయిలుకుఁ బోవుటయే కర్తవ్యమని గాంధిమహాత్ముఁడు ప్రజలకు బోధించి, ఆ యన్యాయమగు చట్టములు రద్దుచేయవలెనని గోరుచు వేలకొలది ప్రజల చేవ్రాళ్లు చేయించిగవర్నరుజనరలునకు మహాత్ముఁడు మహజర్ల నంపెను. సత్యాగ్రహసభను స్థాపించి దేశమున నన్నిప్రదేశములందును "హరతాళముచేయవలె"నని మహాత్ముఁడు బోధము జరపెను.

తీవ్రమగు జాతీయకార్యక్రమము జరుప నువ్విళ్లూరుచుండిన జవహర్లాలునకు గాంధిమహాత్ముని ప్రణాళికయం దభిరుచి గల్గెను. సత్యాగ్రహసభలోఁ జేరి జెయిలుకుఁబోవుటకు జవహర్లా లుద్యుక్తుఁ డగుచుండెను. కాని తన యేకపుత్రుఁడు

కారాగారమున నిర్బాధితుడగుటకు పండితమోతీలాలు నెహ్రూ ఆ సమయమున నంగీకరింపలేదు. ఈ విషయమై తండ్రికొడుకులమధ్య ఏర్పడిన భేదాభిప్రాయములను గాంధి మహాత్ముడు గమనించి యుభయులతోను వేర్వేరుగ సంప్రతించి జవహర్లాలునకు తాత్కాలికముగ శాంతింపజేసెను.

ఇంతలో గాంధీమహాత్ముడు నిర్ణయించిన సత్యాగ్రహ వారమున సౌరసంవత్సరాదినాడు (13-4-1919) పంజాబు రాష్ట్రమునందు అమృతసరు నగరమున జలియన్వాలాబాగు అను తోటలో నొక కాంగ్రెసు ప్రచారసభ జరుగుచుండెను. ఆ సభలో నిరాయుధులై శాంతముగ పాల్గొనుచున్న ప్రజలపై బ్రిటీషు సైనికులు మరఫిరంగులు పేల్చిరి. జనులు చిందరవందరమై యెటు తప్పుకొనుటకు వీలులేక పురుషులు, స్త్రీలు, పిల్లలు వందలకొలదిగ మరణించిరి. పిదప బ్రిటిషు ప్రభుత్వమువారు పంజాబులో సైనికశాసనము నమలుజరిపిరి. సైనికోద్యోగులు అమాయికులగు స్త్రీపురుషుల ననేకమగు హింసలకును అవమానములకును, గురిచేసిరి. ఈ సంఘటనలకే 'పంజాబుదురంతము'లని పేరు గల్గెను. గాంధిమహాత్ముడు, పండిత మదనమోహనమాలవ్యా మున్నగు సుప్రసిద్ధ దేశభక్తులా క్లిష్టపరిస్థితులను చూచుటకు పంజాబునకు వచ్చుచుండగా బ్రిటీషుప్రభుత్వమువారు ఆ నాయకశ్రేష్ఠుల నడ్డగించిరి.

పంజాబు దురంతములనుగూర్చి మన దేశమందేగాక బ్రిటీషు పార్లమెంటునందును ఆందోళన జరిగెను. ఆ సందర్భమున జరిగిన విషయములను విచారించుటకు బ్రిటీషుప్రభు

త్వమువారొక సంఘమును నియమించిరి. ఈ సంఘసభ్యులైన ఆంగ్లేయులు, బ్రిటిషుద్యోగులు పంజాబులో జరిపిన ఘోర కృత్యములను సమర్థించిరి. ఆ సంఘమందలి భారతీయులు బ్రిటిషు ప్రభుత్వమువారిచే నియమింపఁబడినవారై నప్పటికిని బ్రిటిషు సైనికులగు డయరు మున్నగువారు చేసిన క్రూరకృత్యములను ఖండించిరి.

అంతలో పంజాబు దురంతములనుఁగూర్చి సమగ్రమగు విచారణజరుపుటకు కాంగ్రెసువారొక సంఘమును నియమించిరి. దేశబంధు చిత్తరంజనదాసు, పండిత మోతీలాలు నెహ్రూ, బదురుద్దీన్ తయ్యాబ్జీ, జయకరు మున్నగు సుప్రసిద్ధ న్యాయశాస్త్రవేత్తలా సంఘసభ్యులుగ నియమింపఁబడిరి. జవహర్లాలు ఆ సంఘమునకు గార్యదర్శిగ నియమింపఁబడి యమిత శ్రద్ధతోఁ బనిచేసి యథార్థమగు సాక్ష్యమును సంగ్రహించుటలో నెంతయో పాటుబడెను. ప్రజలు చాల శాంతముగ ప్రవర్తించిరనియు, బ్రిటిషు సైనికులు ఘోరకృత్యములఁ జేసి యమాయిక ప్రజల ననవసరముగా హింసకుఁ బాల్పరచిరనియు కాంగ్రెసు సంఘమువారు తగిన సాక్ష్యముతో నిర్ధారణ చేసిరి.

1919 వ సంవత్సరము డిసెంబరు నెలలో అమృతసరు నందు జరిగిన కాంగ్రెసు సమావేశమునకు పండిత మోతీలాలు నెహ్రూ అధ్యక్షతవహించి సభను జయప్రదముగ నిర్వహించెను. బ్రిటిషువారొనర్చిన యక్రమచర్యల ఫలితముగ దేశమున జాతీయోద్యమము క్రమముగా విజృంభించెను.

## 11. జెయిలు యాత్ర

అమృతసరు కాంగ్రెసుసభ పర్యవసానముగ పండిత మోతీలాలు నెహ్రూ సంపూర్ణ జాతీయవాదిగ బరిణామ మొందెను తన అధ్యక్షోపన్యాసమున బ్రిటిషు ప్రభుత్వపు కఠినచర్యలను తీవ్రముగ విమర్శించుటయేగాక, ఆసభ ముగిసి నప్పటినుండియు తన కుమారుడగు జవహర్లాలు కాలమునం తను ప్రజాసేవకై వినియోగించుటకు సమ్మతించెను. అంతే గాక నప్పటినుండియు తనధనమునంతను దేశసేవకు ధార వోయుటకును మోతీలాలు సంకల్పించెను. అంతవరకును తా నుపయోగించుచుండిన విదేశీయ విలాసవస్తువులను విసర్జించి దేశీయ వేషభాషల నవలంబింపదొడంగెను. మఱియు మత్స్య మాంసాదులు వదలి సాత్వికాహారము నుపయోగింప సాగెను.

ఇంతలో గాంధిమహాత్ముడు సహాయనిరాకరణోద్య మమున కంకురార్పణచేసెను. నీతిదప్పి పాలించుచున్న విదే శీయ బ్రిటిషు ప్రభుత్వముతో మనదేశీయులు సహకరింపరాదని గాంధిమహాత్ముడు బోధించెను. అందులకై బ్రిటిషు ప్రభు త్వము మనదేశమున నేర్పరచిన న్యాయస్థానములను ప్రజలు బహిష్కరింపవలెననియు, పాఠశాలలలో విద్యార్థులు చదువు మానవలెననియు, నాయన ప్రబోధము గల్గించెను. 1920 వ సంవత్సరము సెప్టెంబరులోను, డిసెంబరులోను జరిగినకాంగ్రెసు సమావేశములో మహాత్ముని సహాయ నిరాకరణోద్యమ మములు జరుపదగు నని తీర్మానింపబడెను.

అప్పటికే నెహ్రూలిద్దరును న్యాయవాదివృత్తిచే సంవత్సరమున కైదారులక్షల రూప్యములార్జించుచుండిరి. కాని స్వరాజ్యసంపాదనకు సహాయనిరాకరణమే శరణ్యమని కాంగ్రెసు తీర్మానింపగనే దేశమాతసేవకొరకు తండ్రీ కొడుకు లుభయులును వకీలువృత్తిని తృణప్రాయముగ విసర్జించిరి. అంతదనుకను విరివియగు ఖర్చున కలవాటుపడియుండిన నెహ్రూకుటుంబము నిక నీనాడట నిరాడంబర జీవితము గడుప సమకట్టిరి. మోతీలాలు అంతవరకు నెంతో ప్రీతితో పెంచుచుండిన గుఱ్ఱములను బండ్లను అమ్మివేసి, నౌకరులు మొదలగు సిబ్బందిని తగ్గించివేసెను. వెనుకటివలె నానందభవనమున నిక నీనాడట విందులు లేవు. కుటుంబమువారందరును గూడ విలాసవస్తువుల నుపయోగము తగ్గించుకొనిరి.

ఆ సంవత్సరముననే వేసవియందు వ్యాధిగ్రస్తురాలుగ నున్న తల్లిని, భార్యను వెంటబెట్టుకొని హిమాలయప్రాంతము నందలి ఆరోగ్యస్థానమగు ముస్సోరికి జవహరు వెడలెను. నెహ్రూకుటుంబమువారు ముస్సోరిలో దిగిన హోటలునందే మరియొకప్రక్క మనదేశమందలి బ్రిటిషుప్రభుత్వముతో రాజకీయములు చర్చించుటకు వచ్చిన ఆఫ్గనుస్థాన ప్రభుత్వపు రాయబారులు బసచేసిరి. జవహర్లాలునకు ఆ రాయబారులతో నెట్టిసంబంధమును లేదు. కాని ఆ సమయమున జవహర్లాలచట నుండుటవలన నేమి ప్రమాదము సంభవించునోయని భీతిజెంది తక్షణమే ముస్సోరి వదలివెళ్ళవలెనని ప్రభుత్వము వారు జవహర్లాలునకు తాఖీదు నందజేసిరి. ప్రభుత్వాజ్ఞల

ధిక్కరించు కార్యక్రమ మప్పటికి లేనందున జవహర్లాలాక్కడను వెంటనే అలహాబాదునకు మరలెను.

ఆ సమయమునసే కొందరు జమీందారీ రైతులుతమకు జమీందారులవలన గల్గుచుండిన బాధలను ప్రజానాయకులకుఁ దెల్పుకొనుట కలహాబాదు వచ్చియుండిరి. జవహర్లాలా రైతుల మొఱయంతయు విని తక్షణమే యా రైతులతో వారి గ్రామములకుఁ బోయి యా పేదరైతుల కష్టము లన్నియు కండ్లారఁ జూచెను. ఎండకును వానకును లక్ష్యపెట్టక జవహర్లాలు నెలలొఁ దిరిగి జమీందారీ పద్ధతివలన రైతులనుభవించుచుండిన కడగండ్లు చూచి వారితో సంక్షోభావమును గల్గించుటకు ప్రచారమొనర్చెను. అంతవరకును నగరవాసియగు జవహర్లాలు ఆ సమయమున గ్రామస్థుల అజ్ఞానము, దారిద్ర్యము, అనారోగ్యము, నిరుద్యోగము, జమీందారీ విధానపు అగచాట్లు — ఇవన్నియు కండ్లకుఁ గట్టినట్లు అనుభవపూర్వకముగఁ జూడఁగలెను. అంతటినుండియు పేదవారగు కార్మిక కర్షకులకు సేవ చేయవలెనని జవహర్లాలు నిశ్చయించుకొనెను.

1921వ సంవత్సరము వచ్చుసరికి దేశమందలి స్థితిగతులలో క్లిష్టపరిస్థితి యేర్పడెను. ప్రజలయుద్రేకము దినదినమునకు ప్రబలుచు దేశమంతయు నట్టుడికినట్టుడికిపోవుచుండెను. ఇట్టిస్థితిలో బ్రిటిషుసామ్రాజ్యపు యువరాజుచే మనదేశమున సంచారము చేయించి జనులలో రాజభక్తి పుట్టింపవలెనని బ్రిటిషుప్రభుత్వమువారు సంకల్పించిరి. అందులకై వారు ఇంగ్లండునుండి యువరాజును మనదేశమునకు రప్పించి మదరాసు, బొంబాయి, కలకత్తా, అలహాబాదువంటి నగరము

లలో మిగుల నాడంబరముతోను, అట్టహాసముతోను ద్రిప్ప సాగిరి. మన దేశమున బ్రిటిషుసామ్రాజ్య ప్రతిష్ఠను పెంపొందించు నుద్దేశ్యముతో జేయబడు చున్న యిట్టి యుత్సవము లలో బాల్గొనరాదని కాంగ్రెసువారు తీర్మానించిరి. మన దేశమందు జరుపబడుచున్న పరిపాలనపద్ధతి ప్రజామోదమును బడసినది కాదని యీ యువరాజునకు స్పష్టము చేయుట కిదియె మార్గమని కాంగ్రెసువారు నిర్ణయము చేసిరి. యువరాజు ఆయా నగరములకు వచ్చు దినములం దచట పనులన్నియు నాపుజేసి యంగడులు మూసివైచి ప్రజల విచారమును సూచించుటకై హరతాళము జరుపుటకు తగిన సన్నాహములు జరుగుచుండెను.

ప్రజలలో నీ విషయమై ప్రబోధము గావించి తగిన ప్రచారము చేయుటకు స్వయంసేవకదళము (వాలంటీరుకోరు) నిర్మింపబడెను. సంయుక్తప్రాంతమునందీ దళమునకు జవహార్లాలు నాయకుండై చాలాకట్టుదిట్టములతో హరతాళపు కార్యక్రమమును నెరవేర్చుటకు న్యుక్తుండగుచుండెను.

ప్రభుత్వమువారీ విషయమును గమనించి హరతాళ కార్యకలాపముల నడ్డగించు నుద్దేశముతో వాలంటీరుదళము లన్నియు నక్రమ సంఘములనియు నందుం బాల్గొనినవారు శిక్షార్హులనియు క్రిమినల్ లాచట్టము ననుసరించి ప్రకటన చేసిరి. ప్రభుత్వమువారీ ప్రకటనచేయుట యన్యాయమని గుర్తించి దానిని ధిక్కరించుటకై పండిత మోతీలాలుగారు గూడ వాలంటీరుదళమునం జేరిరి. ప్రభుత్వమువా రెంత పోలీసు బందోబస్తు చేసినను, ఉద్యోగస్థులు ప్రజల నుత్సవములలో

బాల్గొనుట కెన్ని ప్రేరేపణలు చేసినను హరతాళ కార్యక్రమము ప్రజలు జరుపుటకు సంసిద్ధు లగుచుండిరి.

ఇంగ్లాండు రాజప్రతినిధియగు యువరాజు అలహాబాదు పట్టణమున సంచారము చేయుటకు నిర్ణయింపబడిన కాల మాసన్న మయ్యెను. అంతట నొక దినమున అలహాబాదు జిల్లా మేజస్ట్రీటు పండిత మోతీలాలు నెహ్రూకొక యాజ్ఞాపత్రము బంపెను. నెహ్రూకు జెందియున్న విశాలమగు మైదానము ప్రభుత్వపు నధీనమున నుంచవలెననియు, దాని నుపయోగించు నధికారము ప్రభుత్వోద్యోగుల పరముచేయవలెననియు నందలి సారాంశము. మోతీలాలు మేజస్ట్రీటునకు సమాధానము వ్రాయుచు తన యాస్తి తనకు న్యాయముగు యుక్తమనియు తోచినరీతి నుపయోగించుకొనుటకు తనకు మాత్రమే హక్కుగలదనియు, ఆ విషయమున తన నాజ్ఞాపించుట కెట్టి యధికారమును మేజస్ట్రీటునకు లేదనియు తెలియజేసెను. 1921 వ సంవత్సరము డిసెంబరు 6 వ తేదిని పోలీసువా రానందభవనమునకు వచ్చి మోతీలాలు జవహర్లాలు నిద్దరను అరెస్టుచేసిరి.

ఆనందభవనమునకు పోలీసువారిరాక అచట కొంత యలజడి గలిగించెను, అచటి సేవకులు పోలీసులను చూడగనే వారిని తన్నితరిమివేయుట కుద్యుక్తులైరి. కాని స్వరూపరాణి వారిని శాంతపరచెను. ఆమె వీరిపత్ని; వీరమాత. అందుచే దేవేంద్రవైభవముతో నలరారుచుండిన ఆనందభవన మిప్పుడు శోభను గోల్పోవుచుండుట యామెమనస్సున కెంతయో ఖేదము గల్గించినను ఆ మనోవ్యధ బయటకు దోచనీయక

యనుంతితథైర్యముతో భర్తను పరపుత్రుని జెయిలుకు సాగనంపెను. పోలీసు మోటారు కారులో తండ్రీ కొడుకులు జిల్లాజెయిలునకుఁ దీసికొనిపోబడిరి.

మరునాడే, అనగా డిసెంబరు ఏడవ తేదీన జిల్లా మేజస్ట్రీటు మోతీలాలు,జవహర్లాలులను విచారణచేసెను. ప్రభుత్వ పక్షమున మోతీలాలు జవహర్లాలులపై కేసు నడపిన వకీలు మోతీలాలునకు చిరకాల మిత్రుండు. ఆనందభవనమున నెన్నిసార్లో, విందుల గుడిచినవాఁడే, కాని యుద్యోగధర్మమును చే నతఁడు మోతీలాలువంటి యుత్తమవ్యక్తిపై నేరారోపణ చేయవలసి వచ్చెను. మోతీలాలునైపు మోమెత్తి మాటలేక గద్గదస్వరము నాతఁడెట్లో వినబడినదా, లేదా ? అనునట్లుగఁ గొన్నిమాట లేవో పలికెను. మోతీలాలు జవహర్లాలులకు చెరి ఆరు నెలలు శిక్ష విధింపబడెను.

---

## 12. రెండవసారి జైలుయాత్ర

మోతీలాల్ జవహర్లాల్, నెహ్రూలు లక్నో జెయిలులో శిక్ష ననుభవించుచుండిరి. కాని బ్రిటిషుయువరాజున కెచటఁ జూచినను బహిష్కారమును, హరతాళములును పూర్తిగ నే జరిగెను. మూడు నెలలు నెహ్రూలు శిక్ష ననుభవించిన పిదప ప్రభుత్వవారికొక ధర్మసందేహము కల్గెను, మోతీలాలు, జవహర్లాలులకు విధింపబడిన శిక్ష న్యాయసమ్మత మగునా ? కాదాయని యనుమానించి యావిషయమునిర్ధారణ

చేయుటకొరకు సంఘమును నియమించిరి. ఆ సంఘసభ్యులు సదరు శిక్ష అన్యాయమని తీర్మానించిరి. వెంటనే మోతీలాలు జవహర్లాలుల శిక్ష రద్దయి వారి స్వగృహములకుం జేరిరి.

ఇంతలో గాంధిమహాత్ముండారంభించిన దౌర్జన్యరహిత సహాయ నిరాకరణోద్యమము హఠాత్తుగ నిలుపుచేయబడెను. చౌరీచౌరా అను స్థలమందలి ప్రజలు అచ్చటి పోలీసువారిపై దౌర్జన్యము జూపినను కారణముచే ప్రజలకింకను తగినంతగ అహింసాసిద్ధాంతము పట్టుపడలేదని తలంచి గాంధిమహాత్ముడుద్యమమును తాత్కాలికముగ విరమించెను. హిందీభాషా ప్రచారము, ఖద్దరు అభివృద్ధి, హిందూ మస్లిము ఐక్యత — మున్నగు నిర్మాణకార్యములచే ఆచరింపదగునని మహాత్ముడాదేశించెను. సహాయ నిరాకరణోద్యమము హఠాత్తుగ నిలుపుటకు జవహర్లాలున కిష్టముకాలేదు. కనుక జెయిలునుండి రాగానే గాంధీమహాత్మునితో ఆ విషయము చర్చింపదలంచెను. కాని ఇంతలోనే గాంధిమహాత్ముని ప్రభుత్వవారరెస్టు చేసిరి.

ప్రజలలోం గల్గిన ఉద్రేకము చల్లారకుండ జాతియోద్యమము పట్టుదలతో నడచునట్లు చేయుటలో జవహర్లాలు శ్రద్ధవహింపసాగెను. ప్రతిసంవత్సరమును కోట్లకొలది విలువగల విదేశవస్త్రము అప్పటికి మనదేశమున కింగ్లండు మున్నగు విదేశములనుండి దిగుమతియగుచుండెను. కల్లుకొరకై తాటిచెట్లను వేలముపాట పాడించి దానివలన ప్రభుత్వమువారు కోట్లకొలది ఆదాయమును గడించుచుండిరి. ఈ పద్ధతివలన ప్రజ

లలో మద్యపానవ్యసనము వృద్ధియై యెన్నియో కుటుంబములు పాడగుచుండెను.

కనుక విదేశవస్త్రబహిష్కారమును, మద్యపాననిషేధమును గాంధిమహాత్ముని నిర్మాణకార్యక్రమములో ప్రధానస్థాన మాక్రమించెను. విదేశవస్త్రములను ప్రజలు కొనకుండను మద్య విక్రయశాలలకు జనులు పోకుండను చేయుటకు శాంతముగా ప్రచారముచేయవలసిన యవసరము కలిగెను. దీనికే పికెటింగు అనిపేరు. జవహర్లాలు సంయుక్తరాష్ట్రీయులం దంతటను పికెటింగుచేయుటకు వలంటీరులను (స్వచ్ఛందసేవకులను) తరిఫీదుచేసి యా యుద్యమమును చాల జయప్రదముగ నడపెను. జవహర్లాలుయొక్క యుక్తిశక్తి దేశమం దితర ప్రాంతములకును మార్గదర్శకమయ్యెను. విదేశవస్త్రబహిష్కారమును, మద్యపాన నిషేధమును మనదేశమం దంతటను ప్రాకి ప్రభుత్వమున కాందోళనము కల్గించెను. అంతట ప్రభుత్వమువారు జవహర్లాలును తిరిగి అరెస్టుచేసి ఇరువదియొక్క నెలలు జైలుశిక్ష విధించిరి. జవహర్లాలు తన కారాగార వాసమును నూలువడకుటలోను, గ్రంథపఠనమందును చాలవరకు వినియోగించెను. జవహర్లాలు పిదప నెహ్రూకుటుంబములోని స్త్రీలను—జవహర్లాలుభార్య కమల, సోదరులు విజయలక్ష్మి, కృష్ణ మొదలగువారినిగూడ ప్రభుత్వమువారు కారాగృహమున నుంచిరి. నెహ్రూకుటుంబమువారికి జుల్మానాలువేసి ఆనంద భవనములోని విలువగల వస్తువులను వేలముపాడిరి. కాని వాని నెవరును వేలములో కొనలేదు.

కాలక్రమమున నాయకులందరును ఖైదీలలో నుండుటచేతను, మనదేశీయులలో స్వార్థపరులు కొందరు బ్రిటిషువారి కండగ నుండుటచేతను జనసామాన్యమునందు ద్వేషము తగ్గి 1922వ సంవత్సరమునాటికి ప్రజావేశము చల్లఁబడెను. అంతట ధైర్యము తెచ్చుకొని ప్రభుత్వమువారు జవహర్లాలును విడుదలచేసిరి. పిదప నతఁడు సంయుక్తరాష్ట్ర కాంగ్రెసుసంఘ కార్యదర్శిగా బనిచేసి కాంగ్రెసువాదులలో నేకీభావము పెంపొందింపఁజేసి యనవసర కలహములను రూపుమాపి కార్యోత్సాహము రగుల్కొల్పెను.

---

## 13. నా భా నా ట క ము

పంజాబురాష్ట్రమున పాటియాలా, నాభా అను రెండు సిక్కు స్వదేశసంస్థానము లుండెను. ఈ రెండు సంస్థానముల ప్రజలును వానిని పాలించురాజులును సిక్కులు, కాని నాభా రాజును, పాటియాలారాజును స్వరూపస్వభావములలో కేవలము భిన్నలక్షణములు గలవారై యుండిరి. పాటియాలా మహారాజు స్వార్థపరుఁడు; అవినీతికి బాల్పడినవాఁడు; బ్రిటిషు వారికి దాసుఁడుగ నుండెను. చాల ధనమును ఇంగ్లండులో దుర్వ్యయము చేయుచుండెను. అందుచే పాటియాలా ప్రజలపై పన్నులభారము హెచ్చెను.

నాభా రాజు స్వతంత్రాభిప్రాయములు గలవాఁడు; జాతీయభావప్రేరితుఁడు, సంఘదురాచారములను మాన్పి నీతి

మార్గమున సంచరింపవలెనను యభిలాషగలవాడై యుండెను.
అందుచే ప్రజలప్రేమకు పాత్రుడయ్యెను.

ఈస్థితిలో పాటియాలా నాభారాజులకు సరిహద్దు
తగాదా లేర్పడి విభేదములు వృద్ధి కాజొచ్చెను. బ్రిటిషు
ప్రభుత్వమువా రాతగాదాలో జోక్యము కలిగించుకొని పాటి
యాలారాజు నభిమానించి నాభారాజును నిష్కారణముగను,
యన్యాయముగను రాజ్యమునుండి తొలగించిరి.

ఈచర్య సిక్కుప్రజలలో సంతాపము గల్గించెను. అట్టి
సమయముననే సిక్కుపీఠాధిపతులగు గురుద్వారామహాంతు
లవినీతి మార్గమున ప్రవర్తించి భోగపరాయణులుగ నుండిరి.
ఈ చెడుపరిస్థితులను సంస్కరింపవలెనను నభిలాషతో 'అకా
లీలు' అను సిక్కుతెగవారు గాంధిమహాత్ముని మార్గము నను
సరించి అహింసాయుతమగు సత్యాగ్రహము నారంభించిరి.
మహాంతులు దుష్టవర్తనులై సత్యాగ్రహులను దౌర్జన్య
ముతో నెదుర్కొనిరి. ఈ దుర్మార్గులకు పాటియాలా మహా
రాజును బ్రిటిషువారును అండగ నిల్చిరి. వాస్తవముగ సిక్కు
ప్రజల శ్రేయోభిలాషియగు నాభారాజును బ్రిటిషు ప్రభుత్వము
వారు పంజాబునుండి చాలదూరమున దక్షిణదేశమందున్న
కొడైకెనాలునకు ప్రవాసిగ బంపివేసిరి. నాభాప్రజలు
అకాలీలిందులకు అసమ్మతి దెల్పుచు సభలు జరిపిరి. సభలో
సిక్కుమతగ్రంథము చదువుచుండగా నాభాపరిపాలన నడుపు
చున్న బ్రిటీషుద్యోగి సైన్యముల సహాయమున అకాలీలను
చెదరగొట్టి వారినాయకుల నరెస్టు చేసెను. అంతట ననేక
ప్రాంతములలో అకాలీప్రజలు సత్యాగ్రహసభలు జరుపగా

పోలీసులు వారిని లాఠీలతో మోదుచుండిరి. ఈ యన్యాయములను పరిశీలింపవలెనని అకాలీలు కాంగ్రెసువారిని కోరిరి.

అట్టిస్థితిలో జవహర్లాలు, సంతానం, గిద్వానీగార్లతో నాభాకు బయలుదేరి అకాలీలకు జరుగుచుండిన యన్యాయములను స్వయముగఁ బరిశీలింప నుద్యుక్తుఁడయ్యెను. జవహర్లాలు, సంతానం, గిద్వానీగార్లు నాభాసరిహద్దులలో నడుగిడుచుండగాఁ బోలీసులు ప్రజలను లాఠీలతో గొట్టి, జవహర్లాలును తన యనుచరులతో తక్షణము నాభాసరిహద్దులు విడిచిపెట్టిపోవలెనని ఆజ్ఞాపించిరి. తాము సత్యాగ్రహము చేయుటకు రాలేదనియు, యథార్థము తెలిసికొనుటకు వచ్చితిమనియు జవహర్లాలు స్పష్టపరచి తమపై యక్రమనిర్బంధము ప్రయోగించినందున తాము చటనుండి కదలమని జవహర్లాలు సమాధానము చెప్పెను.

వెంటనే జవహర్లాలును ఆతని యనుచరు లిద్దరితోఁగూడ పోలీసువారరెస్టుచేసి నాభా జైలునం దుంచిరి. అన్యాయముగ నరెస్టుచేసి యక్రమపద్ధతిని విచారణజరపి, పోలీసువారు మేజస్ట్రేటును కోర్టు కీలుబొమ్మగఁ జేసి యొక నాటక మాడిరి. ఈ విషయమంతయు మోతీలాలునకుఁ దెలిసి జవహర్లాలుతరఫున వాదించుటకు కపిలదేవమాలవీయ యను న్యాయవాదినిఁ బంపెను. పోలీసువారు మాలవీయను వాదింపనీయక నతనిపై గలియఁబడి, యతనిచేతిలోని కాగితము లూడఁబెరుకసాగిరి. జవహర్లాలుపై కుట్రనేరముమోపి రెండేండ్లు శిక్షవిధించి కారాగారమున నుంచిరి. తన కుమారునికి జరిగిన యక్రమమునుగూర్చి మోతీలాలు వైస్రాయికి తంతినిచ్చెను. జవహర్లాలు శిక్షపై అప్పీలుచేయుటకు ప్రయత్నములు జరిగెను.

అంతట నేమనుకొనిరో గాని నాభాయుద్యోగులు జవహర్లాలును ఖైదునుండి విడిచిపెట్టి తిరిగి నాభాకు రాకూడదని ఆజ్ఞ నిచ్చిరి. స్వదేశసంస్థానములు విషయములందు జోక్యము కలిగించుకొనుట కప్పటికి కాంగ్రెసువారు తీర్మానింపలేదు. కనుక జవహర్లాలు నాభానుండి యింటికి తిరిగివచ్చెను.

---

## 14. కాంగ్రెసు కార్యదర్శిపదవి - పౌరసేవ

జవహర్లాలు 1923 వ సంవత్సరమున జెయిలునుండి విడుదలయగుసరికి సహాయనిరాకరణోద్యమముయొక్క తీవ్రత కొంత తగ్గెను. గాంధిమహాత్ముఁ డప్పటికి కారాగారమున నుండెను. కాంగ్రెసునాయకులలో విభేదములు కలిగెను. గాంధిమహాత్ముని యాదేశానుసారముగ కాంగ్రెసువాదులు మాంటెగు చెల్మ్సుఫర్డు సంస్కరణశాసనము (1919) ను బట్టి జరిగిన శాసనసభల యెన్నికలను బహిష్కరించిరి కాని1922వ సంవత్సరమున జరిగిన గయ కాంగ్రెసులో కాంగ్రెసునందు రెండుపక్షము లేర్పడెను; దేశబంధు చిత్తరంజనదాస్, పండిత మోతీలాల్ నెహ్రూ మున్నగు నాయకులు శాసనసభలలో ప్రజాప్రతినిధులు పాల్గొని ప్రభుత్వము నెదుర్కొనవలెనని యుద్దేశించిరి. ఇందులకై వారు కాంగ్రెసు స్వరాజ్యపక్షము నేర్పరచిరి రాజగోపాలాచార్యులుగారు మున్నగు నాయకులు కాంగ్రెసువిధానములో మార్పవసరము లేదనియు, గాంధి

మహాసభయందు సహాయనిరాకరణమున చేర్పరచిన సూత్రములన్నియు నాచరింపదగునవియు నభిప్రాయపడిరి.

జవహర్లాలుకూడ శాసనసభా కార్యక్రమమున నుత్సాహము చూపలేదు. మోతీలాలు స్వరాజ్యపక్షకార్యదర్శిగను, ఢిల్లీ శాసనసభలో స్వరాజ్యపక్షనాయకుడుగ నుండి ప్రభుత్వమును ఎదిరించుచునుండెను. జవహర్లాలు తన దృష్టినంతను యెక్కువగా నిర్మాణకార్యక్రమముపైని మరల్చెను. 1923 వ సంవత్సరము డిశంబరు నెలలో కాంగ్రెసు సమావేశము కాకినాడలో జరిగెను. ఆసభయందు స్వరాజ్యపక్షమునకును, నిర్మాణకార్యక్రమవాదులకును జవహర్లాలు రాజీకుదుర్చుటకెక్కువ కృషిచేసి యందు సఫలతనొందెను. ఉభయపక్షముల వారును కాంగ్రెసుపేరిట తమతమ కార్యక్రమములు జరపుకొనుట కంగీకరించిరి. కాని శాసనసభావాదులనాయకుండు తండ్రియగు మోతీలాలనియు, నిర్మాణకార్యక్రమవాదుల నాయకుండు కుమారుండగు జవహర్లాలనియు స్పష్టము కాజొచ్చెను. కాకినాడకాంగ్రెసులో జవహర్లాలు కాంగ్రెసు ప్రధానకార్యదర్శిగ నెన్నుకొనబడెను.

ఈకాలమునందు ధనార్జనకై జవహర్లాలునకు కొన్ని వ్యామోహములు కల్పింపబడెను. పెద్దపెద్ద వ్యాపారస్థులు జవహర్లాలును తమతమ కంపెనీలకు మేనేజరుగనుండి గొప్ప వేతనము స్వీకరింపవలెనని యాహ్వానించిరి. జవహర్లాలు పేరు ప్రతిష్ఠలవలన తమ వ్యవహారమున యెక్కువలాభము గల్గునని వారు భ్రాంతిపడిరి. కాని జవహర్లాలునకు ధనార్జనపై దృష్టి మరలలేదు.

ఈ పరిస్థితులలోనే మరియొక విచిత్రము జరిగెను. సహాయ నిరాకరణోద మము తీవ్రముగా నున్న దినములలో నా యుద్యమము నెదుర్కొనుటకై బ్రిటిషుప్రభుత్వమువారు మితవాదులకు మంత్రిపదవులిచ్చి గౌరవించిరి. కాని 1923 వ సంవత్సరమునాటికి ఆయుద్యమపుధాటి కొంత సన్నగిల్లెను. అందుచే నిక మితవాదులను చేరదీయవలసిన యవసరము ప్రభుత్వమువారికి లేకుండెను. కనుక బ్రిటిషు ప్రభుత్వమువారు మితవాదులను విడిచిపెట్టి క్రొత్తమంత్రులకొఱకు అన్వేషింపం దొడంగిరి. అప్పు డలహాబాదు హైకోర్టులో ఛీఫ్‌జస్టిస్ (ప్రధానన్యాయాధిపతి)గా నున్న సర్ గ్రింవుడ్ మియర్స్ మోతీలాలు నెహ్రూకు మిత్రుండు. ఆయనద్వారా నెహ్రూ కుటుంబమువారిని తిరిగి బ్రిటిషు ప్రభుత్వము నెడల మిత్రులుగం జేసికొనుట కొక పన్నాగము జరిగెను. జవహర్లాలు నొక మంత్రిగ నియమింపవలెనని ప్రభుత్వమువారికు ద్దేశ్యమున్నటుల జవహర్లాలునకు వర్తమానము చేరెను. అంతట నాతండు బ్రిటిషువారి కిట్లు సమాధానమిచ్చెను.

“అసాధారణ ప్రజ్ఞాశాలి నను అహంభావము నాకు లేదు గాని నేను సామాన్యమగు వివేకముగలవాడ నను విశ్వాసము మాత్రము నాకు గలదు. లోకులుకూడ నేను కొంత లోకజ్ఞానము గలవాండనను భావముతో నున్నారని నాకు తెలియును. ఇట్టిస్థితిలో మంత్రిపదవిని స్వీకరించి కేవలము వివేకశూన్యుండనని ప్రపంచమంతటికిని నేను వెల్లడి చేసుకొనవలెనని ప్రభుత్వమువారి యాశయమా యేమి?”

ఈ వాక్యములు బ్రిటిషుద్యోగుల మనస్సులలో శూలములవలె నాటెను.

కాంగ్రెసు నాయకులు శాసనసభలలోఁ బాల్గొని తమ కాలమును, శక్తిని వ్యయపరచుట వ్యర్థమని జవహర్లాలు విశ్వాసము. తాత్కాలికముగ కొంత సంచలనము గల్గింపఁదగిన కార్యక్రమము జరుపుటకు శాసనసభలలో కాంగ్రెసు సభ్యుల కవకాశమున్నను, గవర్నరుజనరలునకు, గవర్నరులకునుగల ప్రత్యేకాధికారము చే ప్రభుత్వమువారు నందిని పందిని, పందిని నందిని చేయగలరు. అట్టితఱిని శాసనసభా కార్యక్రమము వ్యర్థము. కాని స్థానికసంస్థలు (మునిసిపాలిటీలు, జిల్లాబోర్డులు) ప్రజాసేవకు గొప్ప తావని ఉపకరింపవచ్చును. ఏలయన నివి ప్రజల దైనందినజీవితమునకు ప్రత్యక్షముగా సంబంధించినవి. విద్య, ఆరోగ్యము, బాటలు మొదలగు జనసామాన్యపు యోగక్షేమములకు చెందు విషయములు నిర్వహించు బాధ్యత స్థానికసంస్థలకుఁ గలదు. వీనిని సక్రమముగా నిర్వహించినచో ప్రజాసేవ చేయుటకుఁ గొంత యవకాశ మేర్పడును. నిర్మాణకార్యక్రమమును స్థానికసంస్థలద్వారా ప్రోత్సహింపవచ్చును.

దేశప్రదేశములలో 1923 వ సంవత్సరమున జరిగిన స్థానికసంస్థల యెన్నికలలో కాంగ్రెసులోని ఉభయపక్షముల వారును పాల్గొని చాలచోట్ల అఖండవిజయమును పొందిరి. కలకత్తా కార్పొరేషనుకు దేశబంధు చిత్తరంజనదాసు మేయరుగ నెన్నుకొనబడెను. అట్లే బొంబాయిలో విఠల్ భాయి పటేల్ మేయరయ్యెను. అహమదాబాద్ మునిసిపాలిటీకి

వల్లభాయిపటేలును, పాట్నా మునిసిపాలిటీకి బాబు రాజేంద్ర ప్రసాదును చైర్మనులుగ నెన్నుకొనఁబడిరి. ఇట్లే అలహాబాదు మునిసిపాలిటీకి జవహర్లాలు చెయిర్‌మనుగ నెన్నుకొనఁబడెను.

నిర్మాణకార్యక్రమమే యాదర్శముగానుండిన నాదినములలో జవహర్లాలు తన కాలమునంతను నగరాభివృద్ధికే వినియోగించుట కవకాశ ముండెను. పౌరసేవయే ప్రధానాశయముగ నుంచుకొని మిక్కిలిశ్రద్ధతో మునిసిపలు కార్యనిర్వహణము నాతఁడు కొనసాగింప నుద్యుక్తుఁడయ్యెను. మునిసిపలు ఆదాయము ఒక లక్షరూపాయలకు పైగా నెక్కువగునట్లాతఁడు కృషిచేసెను. రోడ్లు, జలవసతి, పారిశుద్ధ్యము, ఆరోగ్యము, దీపములు, మురుగునీటి పారుదల మున్నగు విషయములలో నెంతయో యభివృద్ధి జవహర్లాలు కలిగించెను. మునిసిపలు పాఠశాలలలో, రాట్నములను, మగ్గములను పెట్టించి బాలబాలికలకు వృత్తివిద్య నేర్పుట కవకాశమును జవహర్లాలు కల్పించెను. నిర్బంధోచిత ప్రారంభ విద్యావిధానము నాతఁడమలుజరిపెను. జాతీయభావములను ప్రోత్సహించు సద్గ్రంథములు బడులలో పాఠ్యగ్రంథములుగ నిర్ణయించు విషయమున జవహర్లాలు శ్రద్ధబూనెను. బీదవాండ్రు నివసించు నగరభాగములు శుభ్రపరపించు విషయమునను అతఁడు కృషిచేసెను. మునిసిపలు కార్యక్రమము జాతీయభాషయగు హిందీలో నడపుటకు జవహర్లాలు యత్నము చేసెను.

ఒకసంవత్సరముపాటు జవహర్లా లిట్లు తదేక దీక్షతో పౌరసేవయొనర్చెను. కాని యింతలో నా కార్యక్రమమున కవరోధము నేర్పడెను. మునిసిపాలిటీలకు స్వతస్సిద్ధముగా

నాగరకవ్యవహారములలో స్వేచ్ఛ తక్కువ. ప్రతివిషయము నందును ప్రభుత్వమువారు మంజూరుచేసినగాని ధనము వెచ్చించుటకు వీలు లేదు. ప్రజాసౌకర్యములందు సానుభూతి లేని విదేశీయోద్యోగులచేతులలో సర్వాధికారములు నుండెను. జాతీయవాదులు ప్రజాదరణముగ మునిసిపలు పరిపాలన నడపుట కిష్టపడినను, అధికారులగు ఐ. సి. యస్. ఉద్యోగులు మాన్యులగు వారి కిష్టమగు విషయము గాకుండెను.

ఇట్టి పరిస్థితులలో జవహర్లాలు విశాలభావములతో సుస్థిరమగు పద్ధతులపై మునిసిపలు కార్యములు నిర్వహింప యత్నించినను ఫలితము లేకపోయెను, గవర్నరు సెక్రటరీలు యేదో యొక ఆటంకము కల్పించుచుండిరి, మునిసిపలు సభ్యులలోకూడ కొందరు స్వార్థపరులై తమవారికి ఉద్యోగములును, కంట్రాక్టులను లభింపజేయుటను ప్రధానకార్యముగ నెంచుకొనుచుండిరి. ఈ కారణములచే జవహర్లాలు 1925 వ సంవత్సరమున మునిసిపలు చెయిర్మను పదవికి రాజీనామా నిచ్చెను.

జవహర్లాలు మునిసిపలు చెయిర్మనుగ నున్నకాలమున నొక విచిత్రమగు సంఘటన జరిగెను. 1 24 వ సంవత్సరమున [illegible], మహోదయ పుణ్యకాలము తటస్థించెను. ఆ విశేషసమయమున లక్షలకొలది హిందూ యాత్రికులు త్రివేణీసంగమక్షేత్రమగు యలహాబాదునకువచ్చి స్నానము చేయుదురు. ఆ సంవత్సరము గంగానది యొద్దను హెచ్చు వరదయుండుటచే స్నానఘట్టము ప్రమాదపరిస్థితిలో నున్నదని తెలిసి యాత్రికులచట స్నానము చేయకుండ నిరోధించుటకై ప్రభుత్వమువారు పెద్దపెద్దవరుల నడ్డముగా కట్టించిరి.

యాత్రికులకు ప్రమాదము లేకుండ రక్షణ యేర్పాట్లు చేయుటకు బదులుగ ప్రభుత్వోద్యోగులు నిషేధపుటుత్తరవు లమలు జరిపి వందలకొలది మైళ్ళదూరమునుండి వచ్చిన యసంఖ్యాకులగు యాత్రికులకు స్నానమున కవకాశము లేకుండఁజేసిరి. పుణ్యకాలము దాటిపోయినఁ దిరిగి యింతటి లభించునది కాదు.

పండిత మదనమోహనమాలవీయ పూర్వాచారపరాయణుఁడగు నాయకుఁడు, నిష్ఠాపరుఁడు, సనాతనాచారములందు భక్తిశ్రద్ధలుగలవాఁడు, హిందూమహాసభకు అధినేత; మితవాది; శాంతుఁడు, కాని పుష్కరసమయమున ప్రభుత్వము వారవలంబించిన నిర్బంధవిధాన మావృద్ధవీరుని కావేశము గల్గించెను. సత్యాగ్రహము చేసియైన నా దినమున నా క్షేత్రమందు స్నానము చేసితీరెదనను ప్రతిజ్ఞను ప్రభుత్వమునకు ముందుగనే తెలియఁబరచి మాలవీయ యుషఃకాలముననే గంగాతీరమును చేరెను. వేలకొలది యాత్రికు లాయనను వెంబడించిరి. వారి నాటంకపరచుటకు ప్రభుత్వముచా రాశ్వికదళమును దెచ్చి స్నానఘట్టమున కడ్డముగ నిల్పిరి.

జవహర్లాలునకు త్రివేణీక్షేత్రమునందు స్నానమాడి పుణ్యము నార్జింపవలెనను కోరిక లేదు, కాని జరిగినవిషయమంతయుఁ దెలిసి స్నానఘట్టమునకు వెడలెను. మునిసిపలు చెయిర్మను పదవినిబట్టి యాత్రికులకు సౌకర్యములు కల్గింపవలసిన బాధ్యతయు నతనికిఁ గలదు. అతఁడు స్నానఘట్టము చేరుసరికి మాలవీయపండితుఁడు, భక్తబృందములును దడికావల ననే వేచియుండి స్నానమునకవకాశముకొఱకు నిరీక్షించుచుండిరి. ఇట్లెంత కాలము వేచియుండినను ప్రభుత్వపు నిర్బంధమువలన

నవకాశమేర్పడ లేదు. క్రమముగా సూర్యుడు నడినెత్తిమీదకు వచ్చెను. ఆతపబాధయు దోడు క్షుద్బాధయు మిక్కుటమయ్యెను.

జవహర్లాలును అతని యనుచరులగు స్వచ్ఛంద సేవకులును (వాలంటీర్లు) యీ దృశ్యమంతయుం జూచిరి. సహజముగ నుద్రేక స్వభావముగల జవహర్లాలునకు భక్తాగ్రేసరుడును శాంతచిత్తుడు నగు మాలవీయపండితున కేర్పడిన నిరోధము చూడంగానే యావేశము మితిమీరెను. హఠాత్తుగ జవహర్లాలు దడిపై కెక్కి కూర్చుండెను. అతని యనుచరు లతని ననుసరించిరి. ఒక వలంటీరు దెచ్చిన జాతీయపతాకమును జవహర్లాలు దడిపై బాతెను. అతని యనుచరులందరు నిట్లే చేసిరి. పిదప జవహర్లాలును, అతని మిత్రులును దడి యావలివైపునకు దుమికి త్రివేణీ సంగమస్థానముం జేరి, స్నానము చేసి తిరిగివచ్చిరి. ఇది చూడగనే వృద్ధుడగు మాలవీయ పండితునకును చాకచక్యము గల్గెను. రక్షకభటు లుద్దుగనుండగనే వీరావేశతో మధ్యనుండి యతిలాఘవముతోం దూరి దడిలోనం దుముకి సంగమస్థానమును జేరి స్నానమాచరించెను. ఆయన వెనుకనున్న భక్తులు నాయన ననుసరించిరి. అశ్వారూఢులైన రక్షకభటులు నిర్వేరబోయి చూడసాగిరి. తమయాజ్ఞ నుల్లంఘించి జవహర్లాలును, మాలవీయయును, యాత్రికులును గంగస్నానమాచరించినను ప్రభుత్వమువారెట్టి కఠినచర్యను గైకొనుటకు సాహసింపలేదు.

# 15. ఐరోపా యాత్ర

సహాయనిరాకరణోద్యమమునందు జవహర్లాలు పాల్గొను చుండిన సమయమున నతనిధర్మపత్నియగు కమలానెహ్రూగూడ జాతీయకార్యక్రమమున తీవ్రముగ కృషిచేయుచుఁ గారాగార వాస శిక్షగూడ ననుభవించెను. సుకుమారశరీర యగు నా యబలకు క్రమక్రమముగ నారోగ్యము చెడిపోయెను. 1925 వ సంవత్సరమున నామెకు వ్యాధిహెచ్చెను. లక్నోయం దామె కెంత చికిత్స చేయించినను గుణముగలుగ లేదు ఐరోపాయందలి శీతభూమిప్రదేశములలోఁ గొంతకాలముండిన నచటి చల్లని గాలికి యామె కారోగ్యమేర్పడునని వైద్యులు సలహాచెప్పిరి. ఆ సమయముననే జవహర్లాలు పెద్దచెల్లెలగు విజయలక్ష్మియు, నామె భర్తయగు రంజితపండితుఁడును ఐరోపాయాత్రకు వెడలుచుండిరి అంతట జవహర్లాలు భార్యయగు కమలను, కుమార్తెయగు యిందిరను వెంటఁబెట్టుకొని స్విడ్జర్లాండునందలి జినీవానగరమునకు వెడలెను. అచటఁగొంతకాలము నివసించి చికిత్సపొందినమీఁదట కమలకుఁ గొంతస్వస్థత యేర్పడసాగెను.

సాంసారికమగు నిబ్బందు లెన్నియున్నను జవహర్లాలు యాలోచనలన్నియు స్వదేశాభివృద్ధివైపుననే ప్రసరించు చుండెను. ఐరోపాయందలి స్వతంత్రజాతుల పరిపాలనావిధానమును, సామాజికసంస్థలను సమ్యగముగ నవగాహనముచేసికొని వానిని మాతృదేశపు సమస్యలఁ బరిష్కరించుట కెట్లు వినియోగింప వీలగునో పరిశీలించు నుద్దేశ్యముతో జవహర్లాలు జర్మనీ మొదలగు దేశములలో సంచార మొనర్చెను. అచటి

కార్మికసమస్యా పరిష్కారయత్నములను, ఆర్థికవ్యవస్థలను, విద్యా ప్రణాళికలను జాగరూకతతో గమనించెను.

అంతేగాక మనదేశపు ఆర్థిక రాజకీయ పరిస్థితులను ఐరోపావాసులకు వివరించుచు, నాయా దేశములందలి రాజ్యాంగవేత్తలతోడను కార్మికనాయకులతోడను, పత్రికాసంపాదకులతోడను సంభాషించుచుం బత్రికలలో వ్యాసములు ప్రకటించుచు భారతదేశమునుగూర్చి ఐరోపాప్రజలకు యథార్థస్థితిం దెల్పుటకనేకవిధముల జవహర్లాలు కృషి యొనర్చెను. మన దేశమును పాలించుచుండిన నాంగ్లేయు లాకాలమున మనదేశమునుగూర్చి ఐరోపాదేశములో వ్యతిరేక ప్రచారము సాగించుచుండిరి. 'భారతదేశమున బుష్కలముగ ధనము నార్జించుకొని స్వదేశమునకు తిరిగివెళ్ళిన నాంగ్లోద్యోగులును, ఆంగ్లవర్తకులును, ఆంగ్లమిషనరీలును, మన దేశీయులవిషయమై ఇంగ్లండు మున్నగు పాశ్చాత్యదేశములలో దుష్ప్రచారము చేయుచుండిరి. భారతీయులు మూఢులు, దురాచారపరాయణులు, అనాగరికులు, పిరికివారు, కలహపరులు– అందుచే నెల్లపుడును ఐరోపావాసులకు లోబడియుండవలసినవారేగాని స్వపరిపాలనకర్హులుగారు' అని యీవిధముగ వారు చాటుట పరిపాటియయినది. ఇట్టియసత్యప్రచారమును ఖండించి పాశ్చాత్యులకు భారతీయులయెడ సానుభూతియు, నాదరభావమును గల్గించుట యవసరమని జవహర్లాలు గుర్తించి యందు కవసరమగు కృషిని చేయుచుండెను.

ఆ తరుణమున ఐరోపాలో బెల్జియం దేశపు రాజధానియగు బ్రసెల్సునగరమున పీడితజాతుల ప్రపంచసభ జరిగెను.

భారతదేశ మిప్పటికి ప్రపంచమునంగల పరాధీనదేశము లన్నింటిలోను ప్రాచీనతమమును నతిదుర్దశలో నున్నదియునై యుండెను. భారత దేశప్రతినిధిగ కాంగ్రెసుమహాసభ యనుమతి ననుసరించి జవహర్లాలు బ్రెసెల్సుమహాసభలోఁ బాల్గొనెను. మన దేశీయుల ప్రధానసమస్యలు, పరదేశీయులగు బ్రిటిషువారు మన దేశమును పాలించుచుండుటచే నేర్పడినయనర్థములు, వాని పరిష్కారమునకు మార్గములు ఇట్టి విషయములను జవహర్లాలు సహేతుకముగ నా సభలో చర్చించి ప్రతిపాదించెను. జవహర్లాలు ప్రతిభావిశేషమున కా సభలోనివా రెల్లరును ముగ్ధులైరి. ఆ సమయముననే సామ్రాజ్యతత్త్వవిరోధకసమితి స్థాపింపఁబడెను. జవహర్లా లా సమితికిఁ గార్యకర్తగ నుండఁ దగునని సభ్యులు కోరిరిగాని, అట్టి పదవిని నిర్వహించుటకుఁ బూనుకొనుటవలన తన మాతృదేశములోనుండి దేశమాతసేవ సేయుట కవకాశము తగ్గునని తలఁచి జవహర్లా లందుల కియ్యకొనలేదు.

ఈ సభజరిగిన కొన్నినెలలకు రష్యావిప్లవవు వార్షికోత్సవము జరిగెను. 1917 వ సంవత్సరమున రష్యదుప్రజలు నిరంకుశాధికారియగు జారును (చక్రవర్తిని) పదభ్రష్టునిగఁ జేసి, సామ్యవాదసిద్ధాంతములపై నాధారపడిన బోల్షివిక్ ప్రభుత్వవిధానమును తమ దేశమున నేర్పరచుకొనిరి. దీని వలన భాగ్యవంతుల పలుకుబడి తగ్గి జనసామాన్యమునకు సౌకర్యము లేర్పడెను. 1927 వ సంవత్సరము అక్టోబరునకు ఈ విప్లవమేర్పడి పదియేండ్లగుటచే రష్యనుప్రజలు తమ రాజధానియగు మాస్కోనగరమున నతివైభవముతో నుత్సవ

ములు జరిపిరి. అందుబాల్గొనుటకు జవహర్లాలుగూడ నాహాజూతుఁడయ్యెను. ఇంతలో పండిత మోతీలాలుకూడ విశ్రాంతికై ఐరోపాకు వచ్చెను. అంతట నెహ్రూకుటుంబము మాస్కోనగరమునకు వెడలి విప్లవోత్సవములలోఁ బాల్గొనిరి.

డిసెంబరు నెలలో మన దేశమున కాంగ్రెసుసమావేశం మదరాసు నగరమున జరుపుటకు సన్నాహాములు జరుగుచుండెను. కనుక జవహర్లాలు రష్యానుండి లండనునగరము మీదుగ మదరాసు చేరెను.

## 16. సైమను కమిషన్

మదరాసుకాంగ్రెసు నాటికి మన దేశపు రాజకీయపరిస్థితులలోఁ గొంతమార్పు కలిగెను. మన దేశస్థులు స్వపరిపాలనకెంతవరకర్హులో పరిశీలించుటకు 1927 వ సంవత్సరమున బ్రిటిషుప్రభుత్వమువారొక సంఘమును నియమించిరి. సర్ జాన్ సైమన్ అను ఆంగ్లన్యాయవాదిని ఆ సంఘమున కధ్యక్షునిగ నేర్పరుచుటచే దానికి సైమన్ కమిషన్ అనిపేరుగల్గెను. ఆ కమిషను సభ్యులందరు నాంగ్లేయులే. స్వరాజ్యము కావలెనని మన దేశీయులు కోరఁగా మనలను పరీక్షించుట కాంగ్ల కమిషను నేర్పరచుట మననాయకులకు వెగటుగఁ దోఁచెను. అందుచే నా కమిషనును బహిష్కరించుటయే యుచితమని నిశ్చయించి మదరాసుకాంగ్రెసు సమావేశములో బహిష్కార

తీర్మానమును ప్రతిపాదించి నెగ్గించుటలో జవహర్లాలు కృషి చేసెను.

కెనడా, ఆస్ట్రేలియా, దక్షిణాఫ్రికాలలోవలె మన దేశమునకుగూడ నధినివేశపరిపాలన (డొమినియన్ స్టేటస్) యేర్పడుటయే మంచిదనియు, స్వరాజ్యమనగా బ్రిటిషుసామ్రాజ్యాంతర్గతమగు స్వపరిపాలనయే యనియు కొందరు నాయకులు భావించుచుండిరి. స్వరాజ్యమనగా బ్రిటిషుసామ్రాజ్యముతో సంబంధములేని సంపూర్ణస్వాతంత్ర్యమని నిర్వచించి సంపూర్ణ స్వాతంత్ర్యమే మన ఆశయమని కాంగ్రెసుసమావేశములో జవహర్లాలు తీర్మానమును యంగీకరింపజేసెను.

ఇట్లు జవహర్లాలు కాంగ్రెసుదృక్పథమును యభ్యుదయ మార్గమున బ్రసరింపజేసి యువకపక్షమునకు నాయకుండయ్యెను. మదరాసుకాంగ్రెసుతీర్మానమునను సరించి యేర్పడిన హిందూస్థాన్ సేవాదళమను స్వచ్ఛందసేవకసమితికి జవహర్లాలధ్యక్షుడుగ నెన్నుకొనబడెను. ఆ సంవత్సరము కాంగ్రెసునకు జవహర్లాలే తిరిగి కార్యదర్శిగ నియమింపబడెను.

సైమనుకమిషనువారు మన దేశమందలి ముఖ్యనగరములలో సంచారముచేసిరి. కాంగ్రెసు తీర్మానము ననుసరించి ఆ కమిషనును బహిష్కరించుట కన్నిచోట్లను యేర్పాట్లు జరిగెను. లక్నోకు సైమనుకమిషను వచ్చినపుడు బహిష్కరణము నేర్పరచిన సమయమున జవహర్లాలుమున్నగు వాలంటీర్లకును, జవహర్లాలు తల్లియగు స్వరూపరాణికినిగూడ పోలీసువారి లాఠీదెబ్బలు తగిలెను. బహిష్కరణము మాత్రము జయప్రదముగజరిగెను. నల్లజెండాలును, 'సైమనూ! వచ్చినదారిని

పొమ్మ'ను నినాదములును కమిషనువారెచటకుఁ బోయి నను వారికి ప్రత్యక్షమయ్యెను. భారతీయుల తీవ్రమగు స్వరాజ్యకాంక్ష లోకమునకు వెల్లడియయ్యెను.

---

## 17. నె హ్రూ ని వే ది క

మొదటి ప్రపంచయుద్ధములో (1914-1918) కెనడా, దక్షిణాఫ్రికా, ఆస్ట్రేలియాలవంటి డొమినియనులు (అధినివేశములు) వలెనే హిందూదేశముగూడ ధన జన సహాయము చాల విరివిగాఁ జేసియుండెను. అట్టి సహకారమునకు ఫలితముగా డొమినియనులకు బ్రిటిష్ప్రభుత్వమువారు యుద్ధానంతర మెక్కువ యధికారములను ప్రతిపత్తిని కల్పించిరి. కాని భారతదేశమున రౌలటుశాసనమువంటి కఠినమగు చట్టములను ప్రజలలో నధికసంఖ్యాకు లంగీకరింపని నేతిబీరకాయవంటి రాజ్యాంగ సంస్కరణముల నమలుజరిపిరి. ఇందులకు ముఖ్యకారణము తెల్లమే. డొమినియను ప్రజలు శ్వేతజాతివారు, భారతీయులు శ్వేతేతరులు.

ఇందులకుదోడు భారతదేశవిషయమున బ్రిటిషు ప్రభుత్వమువారు విషప్రచారముగూడ జేయసాగిరి. 'భారతీయుల కైకమత్యములేదు, వారిలో కలతలు హెచ్చు. గనుక రాజకీయములలో వారి కేకాభిప్రాయ మెన్నటికిని నేర్పడఁజాలదు. అట్టి స్థితిలో శ్వేతజాతులశిక్షణలో వారు కొంతకాల ముండుటయే వారికి శ్రేయస్కరమ'ని బ్రిటిషువారు అమెరికా మున్నగు

చోట్ల ప్రకటించి మన దేశమునకు స్వపరిపాలన నీయకుందు
టకు సాకు జెప్పచుండిరి

ఇట్టిస్థితిని గమనించి మదరాసుకాంగ్రెసులో నొక
ముఖ్యమగు తీర్మానము చేయబడెను. మన దేశ మందలి వివిధ
పక్షములకు జెందిన నాయకులందరును కలసి మన దేశమున
నమలుజరుపదగు రాజ్యాంగవిధానమును నిర్మింపవలెనని యీ
తీర్మానపు సారాంశము. ఈ తీర్మానమును కార్యరూపము
దాల్చునట్లు చేయు భారము కాంగ్రెసుకార్యదర్శియగు జవహ
ర్లాలుపై బడెను. అందునే 1928 వ సంవత్సరము ఫిబ్రవరి
నెలలో ఢిల్లీయందు అఖిలపక్ష మహాసభ జవహర్లాలు సమ
కూర్చెను. కాంగ్రెసుపక్షీయులేగాక మితవాదులు, కులతత్వ
వాదులు, మతావేశపరులు, జమీందారులు, పారిశ్రామిక
నాయకులగు ధనవంతులు మున్నగువారందరును సమావేశ
మైరి. కాని యొకరితత్వము మరియొకరికి పొసగలేదు. కనుక
వివాదము లేర్పడెను.

ముఖ్యనాయకులు కొందరు కొంతకాలమువిదప బొంబా
యిలో తిరిగి సమావేశమై రాజ్యాంగప్రణాళికను నిర్మించుటకు
పండిత మోతీలాలు నెహ్రూ యధ్యక్షతక్రింద నొక సంఘమును
నియమించిరి. దేశమందన్ని పక్షములవారికిని సమాధానముగ
నుండు నుద్దేశముతో నెహ్రూసంఘము వారొక ప్రణాళికను
సిద్ధపరచిరి. దీనికే 'నెహ్రూనివేదిక' యను పేరు గలిగెను. అధి
నివేశప్రతిపత్తియే భారతీయులయాశయమని నెహ్రూనివేదికలో
నుదహరింపబడెను. అన్నివర్గముల వారికిని సంతృప్తి గలిగించు
టయే ప్రధానాశయముగ నెహ్రూసంఘము వర్తించెను.

1928 వ సంవత్సరమున డిసెంబరు నెలలో కలకత్తా యందు జరిగిన కాంగ్రెసుసభకు పండిత మోతీలాలు నెహ్రూ యధ్యక్షుడుగ నెన్నుకొనబడెను. ఆ సమావేశమున నెహ్రూ నివేదికను యామోదింపవలెనని మోతీలాలునెహ్రూ యభిప్రాయమై యుండెను. కాని జవహర్లాలున కధినివేశ ప్రతిపత్తియే భారతీయులయాశయ మనుట యిష్టమగు సంశము కాదు. సంపూర్ణస్వాతంత్ర్యమే భారతీయుల యాశయముగ నుండదగునని యాతడు నెహ్రూనివేదికకు సవరణను ప్రతిపాదించెను. తాను సిద్ధముచేసిన నివేదికను పూర్తిగ నంగీకరింప చో నధ్యక్షపదవిని తాను వదలుకొందునని మోతీలాలు వక్కాణించెను.

ఇట్టి విషమపరిస్థితిలో గాంధిమహాత్ముం డొక సమాధానమార్గమును సూచించెను. “1928 డిసెంబరునుండి ఒక యేడాదిలోగా బ్రిటిషు ప్రభుత్వమువారు నెహ్రూ ప్రణాళిక నమలు జరిపినయెడల సరియే, లేనిచో సంపూర్ణస్వాతంత్ర్యము సంపాదించుటకే భారతీయులు కృషిచేసెదరు” అని మహాత్ముం డుపపాదించిన తీర్మానపుసారాంశము. ఈ విధానము మోతీలాలు జవహర్లాలుల కిద్దరకు నంగీకారమయ్యెను. అందుచే తండ్రికొడుకులమధ్య నేర్పడిన యభిప్రాయభేదము తొలంగెను.

# 18. కాంగ్రెసు అధ్యక్షత

దేశసౌభాగ్యమెక్కువగా కార్మికకర్షకుల శ్రేయస్సుపై నాధారపడియుండునని గ్రహించి జవహర్లాలు కార్మిక కర్షక సంస్థయగు ట్రేడుయూనియనుకాంగ్రెసు కార్యక్రమమునం దెక్కువగ పాల్గొని పాటకపుజనమునందు రాజకీయ ప్రబోధము కలిగించెను. 1928 వ సంవత్సరము చివర ఝరియాలో జరిగిన బొగ్గుగనుల పనివాండ్ర వార్షిక సభకు జవహర్లా లధ్యక్షుఁడుగ నెన్నుకొనఁబడి పాటకపుజనమునకు యుక్తయగు సలహాలొసఁగెను. 1929 సంవత్సరమున నాగపురమున జరిగిన ట్రేడుయూనియనుకాంగ్రెసు సమావేశమునకు జవహర్లా లధ్యక్షత వహించి కార్యక్రమము సక్రమముగ నిర్వహించి కార్మికులకు హితబోధ యొనర్చెను.

ఇట్లుండగా 1929 వ. సంవత్సరమున జరుగవలసియున్న భారతజాతీయ మహాసభా సమావేశమునకు గాంధిమహాత్ముఁ డధ్యక్షపీఠ మలంకరింపవలెనని కొందరు నాయకులు కోరిరి. కాని మహాత్ముఁ డందుల కియ్యకొనక యువకనాయకుఁడగు జవహర్లాలే యాగౌరవమున కన్నివిధముల నర్హుఁడని నిర్ణయింపఁగా, నా సంవత్సరపు కాంగ్రెసు యధ్యక్షస్థానమునకు జవహర్లాలెన్నుకొనఁబడెను. అప్పటికి జవహర్లాలునకు వయసు నలుబదియేండ్లుమాత్రమే. అంత చిన్నవయస్సులో రాష్ట్రపతిపదవి నలంకరించినవారు చాల అరుదు. (గోఖలేయును, మౌలానా అబ్దుల్‌కలాం అజాదును మాత్రము నలుబదియేం డవుడు కాంగ్రెసధ్యక్షులైరి) లాహోరు కాంగ్రెసు సమావే

శమున నధ్యక్షపీఠము జనకుఁడగు మోతీలాలునుండి తనయుఁడగు జవహర్లాలునకు దఖలుపడెను.

తనయధ్యక్షోపన్యాసమున జవహర్లాలు ఉజ్వలభావములను ప్రకటించెను. మన దేశీయులు సామ్యవాద ప్రణాళికను చేపట్టవలెనుగాని, రష్యాయందలి సోవియటునాయకులవలె హింసాచర్యల నవలంబింపరాదనియు, పూర్ణస్వాతంత్ర్యమే జాతీయలక్ష్యముగ నిడుకొని ఆ యావశ్యసిద్ధికై తీవ్రకార్యవిధానము సాగింపవలెననియు, జవహర్లాలుద్ఘాటించెను.

అప్పటికి గతసంవత్సరము కలకత్తా కాంగ్రెసునందు స్వపరిపాలనవిషయమున నిర్ణయింపఁబడిన సంవత్సరము గడువుదాటినది. నెహ్రూ నివేదికకు బ్రిటిషుప్రభుత్వమువా రనుకూలభావము ప్రదర్శింపలేదు గనుక, సంపూర్ణస్వాతంత్ర్యమే భారతీయులలక్ష్యమని గాంధీమహాత్ముఁడు లాహోరుసభలో తీర్మానమును ప్రతిపాదింపగా నది వేలకొలది ప్రతినిధుల యామోదమువడసెను. సంపూర్ణ స్వాతంత్ర్యసాధనకు గాంధిమహాత్ముని నాయకత్వమున శాంతియుత ధిక్కారోద్యమము (సివిల్ డిజొబీడియన్సు మూవ్ మెంటు) నడపుటకును, ఈ లోపున తీవ్రమగు నిర్మాణకార్యక్రమము సాగించుటకును లాహోరుకాంగ్రెసులో తీర్మానింపఁబడెను. జవహర్లాలు లాహోరు కాంగ్రెసు సమావేశమును నతి చాకచక్యముతో నడిపి కాంగ్రెసువాదులలో కార్యశూరతను ప్రేరేపించెను.



## 19. ఉప్పు సత్యాగ్రహము

లాహోరు కాంగ్రెసుతీర్మానము ననుసరించి స్వరాజ్య సంపాదన విషయమున సత్యాగ్రహము సాగించుటకు గాంధి మహాత్ముఁడు నియంతగ నియమింపఁబడెను. 1930 వ సంవత్సరము ఫిబ్రవరి నెలలో మహాత్ముఁడు రాజప్రతినిధి కొక యంత్య సందేశము నంపెను. దాని సారాంశ మేమనగా:— 'ఒక నెల దినములలోగా బ్రిటిషుప్రభుత్వము భారతప్రజలకుఁ గొన్ని పరిపాలనా సౌకర్యములు కలిగింపవలెను. లేనిచో సత్యాగ్రహోద్యమ మారంభమగును. ప్రభుత్వమునకు పన్నులు చెల్లింపకుండుట సత్యాగ్రహమందలి ముఖ్య కార్యక్రమము. బ్రిటిషుప్రభుత్వము భారతీయులపై విధించిన పన్నులన్నింటిలోను యుప్పుపై వసూలుచేయు పన్ను మిక్కిలి యన్యాయమైనది. ఏలయన పేదసాదయను భేదములేక నెల్లవారికిని నుప్పు యవసరమగు నాహారవస్తువు. అట్టి సర్వసాధారణమగు పదార్థ ముపయోగించుటలో స్వేచ్ఛ లేకుండఁజేయుట ఘోరమగు విషయము. కనుక సత్యాగ్రహోద్యమములో నుప్పు పన్ను జెల్లించుటకు నిరాకరణము మొదటిమెట్టుగ నుండు'నని మహాత్ముఁడు రాజప్రతినిధికి తెలిపెను.

కాని రాజప్రతినిధి సమాధానము ప్రతికూలముగ నుండెను. అంతట శాసనసభ్యులగు కాంగ్రెసువారు లందరును తమ పదవులను విసర్జించిరి. శాసనసభాధ్యక్షుడగు విఠల్ భాయి పటేలును తన పదవికి రాజీనామా నిచ్చెను. ఈ పరిస్థితులలో నెహ్రూకుటుంబమువారు భారతజాతి శ్రేయస్సుకొఱకు మరి

యొక గొప్పత్యాగ మొనర్చిరి. జవహర్లాలు ప్రోత్సాహముపై మోతీలాలు తన దివ్యప్రాసాదమగు యానందభవనమును కాంగ్రెసునకు శాశ్వతముగ నిచ్చివేసిరి. అప్పటినుండియు నానందభవనము స్వరాజ్యభవనముగ మార్పు జెందెను.

1930 వ సంవత్సరము ఏప్రిల్ నెలలో గాంధిమహాత్ముడు దండి యనుస్థలమున నుప్పుశాసనము నుల్లంఘించి, యుప్పును తయారుచేసెను. ప్రభుత్వమువా రాయన నరెస్టుచేసి కారాగృహమున నుంచిరి. దేశమంతటను వేలకొలది ప్రజలు యుప్పు సత్యాగ్రహ మొనర్చి జెయిలుకుఁబోయిరి. సంయుక్తరాష్ట్రము నందు జవహర్లాలు సత్యాగ్రహోద్యమ నాయకుఁడై శాసనో ల్లంఘనము చేసి ఆరు నెలలు శిక్షనుపొందెను. ఇది యతని కైదవసారి జెయిలుయాత్ర.

ఈ సమయముననే దేశమంతటను స్త్రీలుగూడ స్వరాజ్యోద్యమమునఁ బాల్గొని సీమ నూలుబట్టల అంగళ్ళవద్దను, మద్యశాలలవద్దను పికెటింగుచేసిరి. అనఁగా విదేశవస్త్రములను, మద్యము నుపయోగింపవద్దని ప్రజలకు శాంతముగ హితబోధ చేయసాగిరి. జవహర్లాలుతల్లి స్వరూపరాణియు, భార్యయగు కమలయు, సోదరియగు విజయలక్ష్మియు వారందరును పికెటింగులోఁ బాల్గొని కారాగారమున కేగిరి. బ్రిటనునుండి వచ్చు బట్టలబేళ్ళు బొంబాయిరేవులోనే నిలువయగునట్లు స్వదేశ వర్తకులు కాంగ్రెసుకు కట్టుదిట్టముచేయుటచే మోతీలాలును గూడ ప్రభుత్వమువారు చెఱయందుంచిరి.

కాని, జెయిలులో వ్యాధిగ్రస్తుఁడగుటచే త్వరలోనే మోతీలాలును ప్రభుత్వమువారు వదలివేసిరి. ఇంతలో నక్టోబరు

నెలయందు జవహర్లాలునకును విడుదలయయ్యెను. తండ్రిజబ్బుస్థితిలోనున్నను జవహర్లాలు దేశసంచారముఁజేయుచు తీవ్ర రాజకీయ కార్యక్రమమునఁ బాల్గొనఁజొచ్చెను. ఆ సమయమున సంయుక్త ప్రాంతపు రైతులు పన్నులవిషయమున జమీందార్లచే మిక్కిలి పీడింపఁబడుచుండిరి. పన్నులభారముచేఁ గర్షకులు క్రుంగిపోయి యెంతమాత్రమును చెల్లింపలేనిస్థితిలోనుండిరి. ప్రభుత్వమువారు జమీందారుల పక్షమునుఁబలపరచుచుండిరి. అట్టి క్లిష్టపరిస్థితిలో జవహర్లాలు రైతుయుద్యమమునకు నాయకుఁడై పన్నులనిరాకరణమును ప్రోత్సహించెను. అందులకై ప్రభుత్వమువారతనిని తిరిగి వారమురోజులలోనే యరెస్టుచేసి జెయిలునందుంచిరి.

ఉప్పుసత్యాగ్రహోద్యమము చాల పట్టుదలతో ప్రజలు నడపి, నలుబది యేబదివేలమంది దేశభక్తులు శ్రీకృష్ణజన్మస్థానమలంకరించిరి. ప్రభుత్వమువారెంత కఠినముగ శిక్షించినను, లాఠీప్రయోగములు చేసినను, ప్రజల యుత్సాహముఁ హెచ్చింగఁజొచ్చెను. భారతీయుల యహింసాయుద్ధమును గమనించుచుండిన నాగరికప్రపంచపు సానుభూతి మన దేశీయులవైపు ప్రసరింపసాగెను. అట్టితఱిని బ్రిటిషువారు మన నాయకులను చెఱనుండి 1931 వ సంవత్సరారంభమున వదలిరి. జవహర్లాలు కారాగారవిముక్తుఁడయ్యెను.

అప్పటికె మోతీలాలునకు వ్యాధి విషమస్థితిలోనికి వచ్చెను. చికిత్సకై యాయనను యలహాబాదునుండి లక్నోకు తీసికొనివెళ్ళిరి. కాని 6—2—1931 తేదీని ఆ మహాత్యాగి పరలోకప్రాప్తిని జెందెను. ఆయన మరణశయ్యప్రక్కనే

మహాత్ముఁ డుండెను. అవసానదశయందు మోతీలాలు గాంధి మహాత్మునిఁ జూచి "మహాత్మా! నేఁ నీలోకమును వదలివెళ్ళు చున్నాను. కాని త్వరలోనే మీరు స్వరాజ్యోదయమును సందర్శించి ముక్తిని సాధింతురు" అని వాక్రుచ్చెను.

హిందూసంప్రదాయానుసారముగ జవహర్లాలు ప్రయాగలో జనకున కుత్తరక్రియలు జరపెను. ఆసమయమున బ్రిటిషు ప్రభుత్వమువారు స్వపరిపాలన విషయమున మననాయకులతో రాయబారములు జరుపుచుండిరి. అందుచే జవహర్లాలు ఢిల్లీ నగరము చేరెను.

పదునైదుదినములు తీవ్రచర్చలు జరిగినమీదట గాంధి మహాత్మునకును రాజప్రతినిధియగు ఇర్విననకును 4-3-1931వ తేదీ నొక ఒడంబడిక కుదిరెను. దీనికే 'గాంధి-ఇర్విను యొడంబడిక' యనిపేరు. బ్రిటిషుసామ్రాజ్యాధినేతలు పాలితజాతియగు భారతీయులతో సమానప్రతిపత్తిజూపి చర్చించి యొడంబడిక చేసికొనుట కిదియే యారంభము. కనుక, నీ యొడంబడిక చరిత్రాత్మకమైనదిగఁ బరిగణింపబడుచున్నది.

కుటుంబావసరములకు సముద్రతీరప్రాంతవాసులు పన్ను లేకుండ నుప్పు నుపయోగించుకొనవచ్చునని ప్రభుత్వమువా రంగీకరించి సత్యాగ్రహఖైదీల నందరను విముక్తులఁజేసిరి. సమాఖ్య (ఫెడరలు) విధానము ననుసరించి బాధ్యతాయుత పరిపాలనను మనదేశములో స్థాపించుటకును, దేశశాంతి రక్షణార్థము కొన్ని ప్రత్యేకాధికారములు తనయందుంచుకొనుటకును బ్రిటిషురాజనీతిజ్ఞులు సమ్మతించిరి. కాంగ్రెసుపక్షమున గాంధిమహాత్ముఁ డా షరతుల కంగీకరించి సత్యాగ్రహోద్యమ

మును విరమించెను. బ్రిటిషుపరిపాలకులు ప్రత్యేకాధికారము లుంచుకొను షరతు జవహార్లాలునకు రుచించలేదుగాని, పెద్దలందరు నందులకు సమ్మతించిరిగాన, నతఁడు నియ్యకొన వలసివచ్చెను. పిదప జరగిన కరాచీకాంగ్రెసులో యిండియా ప్రభుత్వమువారిట బ్రిటిషువారు చేసిన ఋణముల న్యాయా న్యాయముల విషయమునను, భారతీయప్రజల ప్రాతిపదిక హక్కులను గూర్చియు, విస్పష్టముగు తీర్మానములను జవహా ర్లాలు ప్రతిపాదించి స్వరాజ్యసౌధనిర్మాణమునకు శంకుస్థాపన యొనర్చెను.

---

## 20. రౌండుటేబిల్ సమావేశము – తిరిగి జెయిలుయాత్ర

గాంధి ఇర్విను యొడంబడిక ననుసరించి భారతదేశపు రాజ్యాంగవిషయములు చర్చించుటకు బ్రిటిషుప్రభుత్వము వారు మనదేశములో కొందరిని లండనున కాహ్వానించి సభలు జరుపుచుండిరి. ఇట్లాహ్వానింపఁబడినవా రందరును విదేశీయపరిపాలకులకు వెంకతాళము వేయువారే యైయుండిరి. మితవాదులు, ప్రభుత్వ బిరుదిములచే నలంకరింపఁబడినవారు పాశ్చాత్యదేశములలో మనదేశపు ధనమును విలాసముకొరకు వ్యయపరచు సంస్థానాధీశులు, మతమూర్ఖత, కులతత్త్వము మున్నగు సంకుచిత భావములతో నిండినవారు—యిట్టివారే ఆహూతులైరి. ఈ సమావేశమునకు రౌండుటేబిలు సమావేశ మని పేరుగల్గెను. 1930 వ సంవత్సరమున జరగిన మొదటి

రౌండుటేబిల్ సమావేశములో కాంగ్రెసువారు లెట్టి జోక్యము కలిగించుకొనలేదు. మరుచటియేడు జరుగుచుండిన రెండవసమావేశమున కాంగ్రెసుప్రతినిధులు పాల్గొనవలెనని రాజప్రతినిధియగు యిర్విను గట్టిగా ప్రయత్నించెను. అంతట కాంగ్రెసునాయకులు సమావేశమై కాంగ్రెసుపక్షమున గాంధి మహాత్ముని నేకైకప్రతినిధిగ నియమించిరి. ఈ సమావేశము వలన విశేషప్రయోజనమేదియు నుండఁబోదని జవహర్లాలు వంటి దూరదృష్టిగలవారు ముందుగనే గ్రహించిరి. అందుచే దేశమున సంచారమొనర్చుచు ప్రజలలో జాతీయకార్యోత్సాహము గల్గించుటయే కర్తవ్యముగాని, యట్టి క్లిష్టపరిస్థితిలో దేశము వదలి వెడలుట వ్యర్థమని జవహర్లాలు సంకల్పించెను.

ఆనందభవనదానము విషయమున మోతీలాలు జీవితకాలమున న్యాయశాస్త్రసమ్మతమగు దస్తావేజు యేర్పడలేదు. అందుచే జవహర్లాలా కార్యకమము శీఘ్రముగఁ బూర్తి చేసెను. దేశసేవకులు దశమాలనుదర్శించుచు నతఁడు ప్రజలలో నుత్సాహము చల్లారకుండఁ జాగరూకత వహించుచుండెను.

ఇంతలో జవహర్లాలు భార్యయగు కమలకు తిరిగి యస్వస్థత యేర్పడెను. దుర్బలశరీరిణియైనను ఆ పతివ్రతాశిరోమణి భర్తతోఁబాటు నిరంతరము దేశసేవాపరాయణురాలుగ నుండెను. అందుచే నామె కారోగ్యము కుదుటఁబడుట కవకాశము తక్కువగుచుండెను. ఆకారణమున నామెకు విశ్రాంతి చేకూర్చుటకొరకు కమలతోఁగూడ జవహర్లాలు సింహళమునకు ప్రయాణమయ్యెను. కొంతికాల మచటనుండి యా పుణ్యదంపతులు బొంబాయికి దిరిగవచ్చిరి.

ఇంతలో రౌండుటేబిల్ సమావేశపరిస్థితులు విషమించెను. మతమూర్ఖతయు, కులతత్వవాదమును ప్రధానముగ గలవారి మాటయే యీ సమావేశమున చెల్లుబడియయ్యెను. గాంధిమహాత్ముని యుదారాశయములకచట తావు లేకుండెను. ఇది యిట్లుండ బ్రిటిషుపార్లమెంటున కెన్నికలు జరుగగా భారతజాతీయాభివృద్ధికి విముఖులగు కన్సర్వేటివుపక్షమువారు అధికసంఖ్యాకులుగ నెన్నుకొనబడిరి. మనదేశమున కనుకూలమగు సంస్కరణములు జరుగు నవకాశము తగ్గిపోయెను. అందుచే నా సమావేశమున బాల్గొనుట వ్యర్థమని నిశ్చయించుకొని గాంధిమహాత్ముడు స్వదేశాగమనోన్ముఖుడయ్యెను.

ఈలోగా దేశపరిస్థితులు క్లిష్టరూపము దాల్చెను. ఇందులకు ప్రపంచపు ఆర్థికసమస్యలు కొంతవరకు కారణమయ్యెను. అన్నిదేశములకును ధనము పెట్టుబడి పెట్టుచుండిన అమెరికాయందు హఠాత్తుగ నార్థికమాంద్య మేర్పడి బ్యాంకులు దివాళాతీసెను తత్ఫలితముగ ప్రపంచవ్యాపారము స్తంభించెను. పంటలధరలు తగ్గిపోయెను. రైతులు దుర్భరస్థితిలో మునిగిపోసాగిరి. ఎంతధాన్యము నమ్మినను పన్నులకే సరిపోవుట లేదు. మనదేశమందలి సంయుక్తరాష్ట్రములందలి రైతులపరిస్థితులు మరియు ఘోరమయ్యెను. ఆ రాజధానిలో జమీందారు లధికము. జమీందారులు రైతులవద్ద చాల యెక్కువరేటుతో పన్నులు వసూలుచేయుచుండిరి. ఆర్థిక క్లిష్టపరిస్థితులను గమనింపక రైతులను నిర్దాక్షిణ్యముగ పన్నులకొరకు జమీందారులు పీడింపసాగిరి. ప్రభుత్వమువారు జమీందారులనే మద్దతు చేయుచుండిరి.

అట్టి సమయమున రైతులు కాంగ్రెసు నాయకులతోఁ దమ కడగండ్లుబాప యత్నింపవలెనని మొఱపెట్టుకొనిరి. జవహర్లాలు రైతులదుస్థితిని చూచి వారికి సత్యాగ్రహమే శరణ్యమనియు, రైతులు పన్నులు చెల్లించుట నిరాకరింపవలెననియు బోధించెను. ప్రభుత్వమువారు ఆర్డినెన్సులు మున్నగు నసాధారణచర్య లవలంబించి కఠిన నిర్బంధవిధానమునకుఁ బూనుకొనిరి. పోలీసుద్యోగుల దౌర్జన్యమంతకంతకు హెచ్చెను. ఈ విషమపరిస్థితులు క్రమముగా బెంగాలు, సరిహద్దురాష్ట్రములకును వ్యాపించెను.

గాంధిమహాత్ముఁడింతలో జెయిలునుండి విడుదలఁబొంది బొంబాయి చేరెనని వార్త తెలియగనే యాయనను కలసికొని మాటలాడుటకును, వ్యాధిగ్రస్థురాలై బొంబాయి యందున్న తన ధర్మపత్నిని చూచుటకు జవహర్లాలు బొంబాయికి బయనమయ్యెను. ఈ విషయము తెలిసి జవహర్లాలు యలహాబాదు వదలి వెళ్ళరాదని యతఃకి జిల్లామేజస్ట్రీటొక యుత్తరవు నంపెను. తానా యాజ్ఞనుల్లఘింప నిశ్చయించితినని మేజస్ట్రీటునకుఁ దెల్పి జవహర్లాలు బొంబాయికిఁ బోవుటకు రైలెక్కగా నలహాబాదునకు ప్రక్కస్టేషనునందే యాతని నరెస్టుచేసి పోలీసువారు జైలునందుంచిరి. ఈ పర్యాయము జవహర్లాలునకు రెండున్నర సంవత్సరములు కారాగారశిక్ష విధింపఁబడెను.

---

## 21. భార్యావియోగము

1933 వ సంవత్సరము ఆగస్టు నెల వచ్చుసరికి జవహార్లాలు తల్లియగు స్వరూపరాణికి వ్యాధి చాలా యెక్కువయయ్యెను. అందుచే జవహర్లాలును శిక్షగడువు ముగియకముందే 30—8 1933 తేదీన ప్రభుత్వమువారు విడుదల చేసిరి. వెంటనే అతఁడు పూనాలోనున్న గాంధిమహాత్మునితో దేశపరిస్థితులు చర్చించెను. ఆ సమయమున బెంగాలునందు విషమస్థితియేర్పడెను. వంగదేశమందలి దౌర్జన్యచర్యలణఁచుటకను మిషతో ప్రభుత్వమువారతికఠినశాసనముల నారాష్ట్రమున నములు పరుపసాగిరి కాంగ్రెస్ కార్యకలాపముల కాటంకము గల్గింపఁజొచ్చిరి. అందుచే నచటి స్థితిగతులు స్వయముగ గమనింపఁదలఁచి జవహర్లాలు బంగాళమునకు వెడలి స్థానిక నాయకులతోఁ జర్చించి బహిరంగసభలలో నుత్తేజకరముగ నుపన్యసించెను.

అదేసమయమున ననగా 1934 వ సంవత్సరారంభమున బీహారునందు గొప్ప భూకంప మేర్పడి చాల భీభత్సము జరిగెను. వేలకొలఁది జనులు మరణించి లక్షలకొలఁది జనులు తిండి లేకయు, తలదాచుకొనుటకుఁ తావు లేకయు నల్లాడుచుండిరి. జవహర్లాలా స్థలములకుఁబోయి యచటి దీనులకష్టముల నివారణ కెంతయో పాటుపడెను అచటనుండి జవహర్లాలు అలహాబాదుచేరి, విశేషద్రవ్యము ప్రోగుచేసి బీహారులోని బాధితులకు పంపు కార్యక్రమమున నిమగ్నుఁడయియుండెను.

కలకత్తాలోనున్నపుడు నతఁడిచ్చిన యుపన్యాసములు రాజద్రోహకరమైనవను మిషపై నింతలోఁ బ్రభుత్వమువారు

జవహర్లాలు నరెస్టుచేసి రెండేడ్లు శిక్షవిధించి కలకత్తా జయిలులో నుంచిరి. ఇది యతని జెయిలుయాత్రలో నేడవది.

భర్త కారాగారమున నున్నకాలమున కమల దేశసేవానిమగ్నయై దేశసేవికులకు తరిఫీదు నిచ్చుచును, స్త్రీజాతి యభ్యుదయమునకుఁ బాటుపడుచును చాలసార్లు యరెస్టయి జెయిలు నివాసము చేయుచుండెను. 1935 వ సంవత్సరమున నా యబలకు వ్యాధి చాల హెచ్చయ్యెను. ఎన్నియో చికిత్సలు జరిగినను తగ్గుముఖమునకు రాలేదు. అట్టిస్థితిలో నామె స్విట్జర్లాండునకుఁ బోవుట మంచిదని వైద్యులు సలహా చెప్పుటచేఁ బుత్రికయగు నిందిరతోఁగూడ కమల యా దేశమునకు చేరెను. స్విట్జర్లండు చేరినవెంటనే యామెకుఁ గొంత గుణము కన్పించినను, ఆ సంవత్సరాంతమునకు వ్యాధి తీవ్రరూపము దాల్చెను. అందుచే జవహర్లాలును ప్రభుత్వమువారు విడుదల చేయుగా నతఁడు వెంటనే విమానముపై స్విట్జర్లండునకు వెడలెను, భార్యకు వైద్యవిషయమున జవహర్లా లెంతయో వ్యయప్రయాసలఁ బొందెను. కాని 28-2-1936 వ తేదీని సాధ్వీమతల్లియు, వీరపత్నియునగు కమల స్వర్గస్థురాలయ్యెను. పిదప జవహర్లాలు తన కుమార్తెయగు యిందిరను స్విట్జర్లండున నొక విద్యాలయమునఁ బ్రవేశపెట్టెను.

---

# 22. లక్నో, ఫేయజ్‌పూర్ కాంగ్రెసుల యధ్యక్షత.

సతీవియోగముచే సంతాపుడయ్యు జవహర్లాలు విదేశములందున్న సమయముననుగూడ మాతృదేశసేవ మానలేదు. యూరపు రాజ్యములలోను, ముఖ్యముగా లండను నగరమందును రాజకీయవేత్తలతో జవహర్లాలు భారతదేశ సమస్యల జర్చించుచుండెను.

ఇంతలో మనదేశమున ఏప్రియల్ నెలలో లక్నోయందు కాంగ్రెసు సమావేశము జరుగవలసియుండెను. దేశ పరిస్థితులపుడు చాల అధ్వాన్నముగ నుండెను. ప్రజలలో కులకక్షలును, జాతివిద్వేషములును హెచ్చుటచే జాతీయ కార్యక్రమమున నుత్సాహము సన్నగిల్లెను. రాజకీయ నాయకులలో నభిప్రాయ భేదములును, పక్షములును మితిమీరెను. శ్రీమంతులగు జమీందార్లును, స్వదేశ సంస్థానాధీశులును విలాసములను మరిగి స్వార్థపరాయణులై, స్వధర్మమును మఱచి పరప్రభుత్వమున కండయై నిలచిరి. ఈ పరిస్థితులం జూచి విసుగుజెంది గాంధిమహాత్ముడు రాజకీయరంగమునుండి నిష్క్రమింప నుద్యుక్తుడుగ నుండెను.

ఇట్టి క్లిష్ట పరిస్థితులలో స్వాతంత్ర్యోద్యమ నౌకను సక్రమముగ నడిపింపఁగల కర్ణధారి జవహర్లాలేయని కాంగ్రెసువాదులెల్లరు నిశ్చయించి యతనిని లక్నో కాంగ్రెసధ్యక్ష పీఠమలంకరించి జాతీయోద్యమమును ముందునకు సాగింపవలెనని యర్థించిరి. భార్యావియోగముచే క్రుంగియుండియు దేశమాతపిలుపు చెవినిఁ బడఁగనే జవహర్లాలు స్వదేశమును చేరి

ధైర్యచాతుర్యములతో కాంగ్రెసు సమావేశమును నడపి స్వాతంత్ర్యశంఖారావము నుచ్చైస్స్వనమున బూరించెను. దేశమునం దేర్పడిన విభేదములను సమన్వయముచేసి యైకమత్యముతో స్వాతంత్ర్యరథము పురోగామిమార్గమునఁ బోవునట్లు చేయుటకు జవహర్లాలు యావచ్ఛక్తిని వినియోగించెను. ఆ సంవత్సరము దేశమందంతటను సంచారముచేసి కాంగ్రెసు సంస్థయందు విదేశాంగశాఖ, ప్రచారశాఖ, శాసనసభా కార్యక్రమశాఖ, నిర్మాణకార్యక్రమశాఖ ఇట్లు వేర్వేరుశాఖ లేర్పరచి యవియన్నియు సక్రమపద్ధతులపై నడచున ట్లతఁడు కట్టుదిట్టములు చేసెను. జనసామాన్యమునందు కాంగ్రెసు సందేశము వ్యాపించి దృఢముగ నాటుకొనుట యవసరమని యతఁడు గుర్తించి స్వయముగా ప్రచారము జరిపియు ఉపసంఘముల కార్యక్రమమూలమునను జవహర్లాలు నిరంతర కృషి యొనర్చెను.

మరుచటిసంవత్సరము అనగా 1937 వ సంవత్సరమున జాతీయమహాసభయొక్క ఏబదియవ సమావేశము జరుగవలసి యుండెను. కాంగ్రెసునకు నూతనచైతన్యము గల్గించి జాతీయోద్యమమును ముందునకు సాగింపఁగల వ్యక్తి జవహర్లాలే యని భారతీయుల దృఢవిశ్వాస మగుటచేఁ దిరిగి యతనినే జాతీయమహాసభాధ్యక్షునిగ నెన్నుకొనిరి. పూర్వమువలె నగరములందుగాక ఈసారి సమావేశము ఫేయజ్‌పూ రను గ్రామమున జరిగెను. తిలక్‌నగరమను కాంగ్రెసుశిబిర మచట నిర్మింపఁబడెను. ఒక లక్ష యేబదివేలమంది జాతీయవాదు లచట సమావేశమైరి. ప్రజ్ఞ, ధైర్యము, సమయస్ఫూర్తి,

నిర్వహణశక్తి — ఇట్టి గుణములు మొదుగ జూపి జవహర్లాలు ఫెయిజుపూరు కాంగ్రెసును జయప్రదముగ నడపెను. పూర్ణ స్వాతంత్ర్యలక్ష్యమును దేశీయులకండ్లయెదుట నా ప్రతిభాశాలి మరియొకసారి నూతన తేజముతో సాక్షాత్కరింపజేసెను.

---

## 23. జాతీయప్రచారము; కాంగ్రెసు విజయము

జవహర్లాలు రాష్ట్రపతిగ (కాంగ్రెసధ్యక్షుడుగ) నుండిన రెండేండ్లలో విశేషముగ దేశమందు సంచారముజరపి జాతీయ కార్యక్రమమును పునర్నిర్మాణముచేసి, విభేదములున్నచోట్ల సమన్వయము చేయుటలో నెక్కువగ కృషియొనర్చెను. సంపూర్ణ స్వాతంత్ర్యలక్ష్యమును దేశమందలి మారుమూలలకు కూడ వ్యాపింపజేయుటయే యతడు ప్రధానాశయముగ జేసికొనెను.

అందులకు మంచితరుణ మాసమయమునదటస్థించెను. 1935 వ సంవత్సరములో బ్రిటిషుపార్లమెంటువారొక భారత రాజ్యాంగశాసనమును చేసిరి. 1927 వ సంవత్సరమున సైమను కమిషనుతో నారంభించి యెన్నియో విధముల తర్జనభర్జనలు జరుగగాజరుగగా దుద కీ శాసనము బయటబడెను. దీని ననుసరించిరాష్ట్రములందు ప్రజలచేనెన్నుకొనబడిన మంత్రులచే పరిపాలనాశాఖలన్నియు నిర్వహింపబడునని నిర్ణయింపబడెను. దీనికే రాష్ట్రీయస్వాతంత్ర్యమని పేరు; కాని రాష్ట్రీయస్వాతం

త్వము జయప్రదముగా జరుగుట కొక గొప్ప యాటంక మాశాసనమునం దేయుండెను. ఏలయన గవర్నరులకు ప్రత్యేకాధికారములు కొన్ని యీయఁబడెను. గవర్నరునకు బుద్ధి పుట్టినచో ప్రజాప్రతినిధులు చేసిన శాసనముల నతఁడు రద్దు చేయవచ్చును. ప్రజాప్రతినిధుల యభిప్రాయముతో నిమిత్తము లేకయే తన కవసరమని తోచిన శాసనములు గవర్నరు అమలు జరుపవచ్చును. ప్రజలచే నెన్నుకొనఁబడిన మంత్రుల పరిపాలనలో జోక్యము కలిగించుకొని తనకు యుక్తమని తోచినరీతిగ పరిపాలన నతఁడు నడిపించవచ్చును.

ఈ రాజ్యాంగ శాసనమున నట్టి యవరోధము లున్నను కాంగ్రెసుపక్షమున శాసనసభలకు ప్రతినిధులను బంపవలెనని కాంగ్రెసుసభవారు నిర్ణయించిరి. ఈరీతిగ దేశమున కాంగ్రెస్ పక్షమునకు గల బలము బ్రిటిషు ప్రభుత్వమునకే గాక లోకమునకంతటికిని వెల్లడికావలెనని మన నాయకుల యభిప్రాయమై యుండెను.

ఎన్నికలలో కాంగ్రెస్ పక్షీయులకు జయము కలుగకుండుటకై ప్రభుత్వమువా రన్నివిధములను జాగరూకత వహించిరి. ముఖ్యముగ మనదేశమందలి జమీందారులు మున్నగు భాగ్యవంతులను, ప్రభుత్వమువారు చేరదీసి వారి పలుకుబడి నుపయోగించి, జనసామాన్యమును లోబరచుకొని, యేవిధముగ యెన్నికలలో కాంగ్రెసు నోడింపవలెనని వారు సంకల్పించిరి. జమీందారులును విదేశప్రభుత్వమునకు వెనుక తాళము వేయుటకు సిద్ధపడిరి ఏలయన మన దేశమందలి సామాన్యప్రజలు యభ్యుదయ మొందుట జమీందార్ల

కభిమతము కాదు. విదేశీయపరిపాలనయందే తమయాటలు సాగునని జమీందారులు గుర్తెఱిఁగియుండిరి.

ఇందులకుఁదోడు బ్రిటిషు ప్రభుత్వము వారు మరియొక వ్యూహమును పన్నిరి. ఎన్నికవిధానమును మతతత్త్వము మీఁదను, కులతత్త్వముమీఁదను నాధారపరచిరి. కొన్ని ప్రాంతములలో మహమ్మదీయులకే ప్రాబల్యముండున ట్లేర్పాటు చేసిరి. హరిజనులు మున్నగు జాతులకు కులము వారిగ యెన్నిక దార్లను (వోటర్లను) నిర్ణయించిరి.

ఇట్లేవిధముగఁ జూచినను దేశమందు జాతీయభావముల కవకాశము లేకుండ, ఎన్నికలఫలితముగ దేశమున నంతఃకలహములు వృద్ధియగునట్లు జేసి మొత్తముపై న నుదారాశయములు గల కాంగ్రెసుసంస్థను యెన్నికలలోఁ దలయెత్తకుండఁ జేయుటకు తగిన యెత్తులన్నియు బ్రిటిషు ప్రభుత్వము వారెత్తిరి.

ఇన్నిచిక్కులలో నెన్నికలందు కాంగ్రెసు పక్షపు యభ్యర్థులు గెలుపొందుట చాల క్లిష్టముగ గన్పట్టుచుండెను. ఎట్లయినను కాంగ్రెసుపక్షమును గెల్పించుభారము రాష్ట్రపతి యగు జవహర్లాలుపైఁబడెను. కాంగ్రెసు ప్రతిష్ఠను నిలపి కాంగ్రెసుకు జనసామాన్యమునందుగల పలుకుఁబడిని లోకమున కింతటికిని చాటుట కతఁడు కృతనిశ్చయుఁడయ్యెను.

1937 వ సంవత్సరము ఫిబ్రవరినెలలో రాష్ట్రశాసన సభలకు యెన్నికలు జరుగవలసియుండెను. కనుక నంతకు ముందుగా జవహర్లా లన్నిరాష్ట్రములందును పర్యటనమారంభించెను. నిరంతరప్రచారము చేయుచు రోజునకుపదపంద్రెండు బ్రహ్మాండమగు సభలలో నుపన్యసించుచు రాత్రింబగళ్ళు

విధి విరామములులేక జవహర్లాలు కొన్ని నెలలపాటు ఆసేతు శీతాచలమును సంచారమొనర్చెను. అమితోత్సాహముతో నెహూ్రు యుపన్యసించుచుండ మార్గమధ్యమందు కుగ్రామములలోను వేలకొలదిగ జనులు గుమిగూడి యతనివాగమృత ధారలగ్రోలి విద్యుచ్ఛక్తి ప్రేరితులవలె నుత్సాహితులై కాంగ్రెసునందు లగ్నమనస్కులగుచుండిరి తత్ఫలితముగ ఆ యెన్నికలందు గొప్ప పలుకుబడిగలవారమని గర్వితులైన జమీందార్లును, కులతత్త్వనాయకులును యమితమగు జనధన సాధనసంపత్తుల సహాయము కల్గియుండి పోటీచేసినను తుదకు భారతదేశమందలి పదునొకండు రాష్ట్రములలోను ఏడు రాష్ట్రములలో కాంగ్రెసుపక్షీయులే యత్యధికసంఖ్యాకులైన శాసనసభా ప్రతినిధులుగ నెన్నుకొనబడిరి.

ఈ యాశ్చర్యకరమగు సంఘటనమువలన బ్రిటిషు సింహమునకుఁ దన గుహలోనే తన శత్రువులు మీసములు పట్టుకొని యాడించినట్లనిపించెను. సర్వసంగపరిత్యాగము చేసి, కారాగారవాసశిక్ష ననుభవించి యహింసాశపథమునుఁబూని, రాట్నమే శరణ్యమని నమ్ముకొనియున్న ఐహికబలశూన్యులగు కాంగ్రెసుపక్షీయు లెక్కడ ? రవి యస్తమింపని సామ్రాజ్యమున కధిపతులై, రాజకీయ కార్యధురంధరులై, సమస్త బలసంపన్నులగు బ్రిటీషు ప్రభుత్వాధికారు లెక్కడ? ఈ ఎన్నికలలో కాంగ్రెసుపక్షము నఖండవిజయము చేకూరుట యను నంశము ప్రపంచవాసుల నెల్లరను విభ్రాంతులఁ జేసినది. నాయకశిరోమణియగు జవహర్లాలుని అకుంఠిత

దీక్షయే యీ విజయమునకు చాలవరకుఁ గారణమనుటలో నతిశయోక్తి లేదు.

శాసనసభ్యు లధికసంఖ్యాకులుగ నెన్నుకొనఁబడిన యేడు రాష్ట్రములందును (మదరాసు, బొంబాయి, సంయుక్త పరగణాలు, మధ్యపరగణాలు, ఒరిస్సా, అస్సాం, బీహారు) కాంగ్రెసుపక్షీయులు, మంత్రివర్గము లేర్పరుపవలసియుండెను. కాని గవర్నరులకుఁగల విపరీతాధికారములను వారు వినియోగింపఁ బోమని వాగ్దానము చేసిన పక్షముననే కాంగ్రెసు వారు మంత్రిపదవుల స్వీకరింపవలెనని కాంగ్రెసు పెద్దలు నిశ్చయించిరి. బ్రిటిషు ప్రభుత్వమువారు విధిలేక యట్టి వాగ్దానము నిచ్చిరి. వైస్రాయియగు లిన్‌లిత్గో బహిరంగముగ నొక ప్రకటనచేసి మంత్రుల అనుదిన కార్యక్రమములో గవర్నరులు జోక్యము కల్గించుకొనఁబోరని వాగ్దాన మొనర్చెను. అంతట రాష్ట్రములలో కాంగ్రెసు మంత్రివర్గము లేర్పడెను. సంయుక్త రాష్ట్ర మంత్రివర్గమున జవహర్లాలు చెల్లెలగు శ్రీమతి విజయలక్ష్మి పండిట్ స్థానికపరిపాలన శాఖామంత్రిణిగ నియమింపఁబడెను. ఇట్టిపదవి నలంకరించిన ప్రథమ భారతమహిళ యీమెయే.

ఈ యెన్నికలసమయముననే మనదేశమందలి సామ్యవాదులు, హిందు మహాసభా పక్షీయులు మున్నగు వివిధ పక్షములకుఁ జెందినవారు కాంగ్రెసు ఆశయములకు భిన్నముగఁ ప్రవర్తింప నుద్యుక్తు లగుచుండిరి. ఆ విషయము గ్రహించి జవహర్లాలు వారినందరి నొక త్రాటిపై నడపించి కాంగ్రెసు విజయమే ప్రజావిజయమనియు, బ్రిటిషు సామ్రాజ్య

వాదుల నెదుర్కొనుటలో మన దేశీయు లందరు నేకీభవించు టయే కర్తవ్యమనియు వారి నొప్పించి వివిధ పక్షీయులను కాంగ్రెసున కనుకూలురుగఁ జేసెను.

ఎన్నికల సమయమున గల్గిన నిరంతర శ్రమవలన 1937 వ సంవత్సరము ఏప్రిల్ నెలలో జవహర్లాలు కనారోగ్యముగల్గెను. అందుచే విశ్రాంతికొఱకతఁడు బర్మా మలయ ప్రాంతములందుఁ గొంతకాలము గడపుచు నచటనున్న యద నున నాయాప్రాంతపు జనులకు భారతీయులతో మైత్రి యేర్ప రచుటకు కృషి చేయుచుండెను. పిదప అక్టోబరు నెలలో సరి హద్దు రాష్ట్రములలో సంచారము జేసి యచటి పఠానులలో శాంతిసఖ్యభావములను జవహర్లాలు పెంపొందింపఁ జేసెను. అట్లే అస్సాంరాష్ట్రమున పర్యటన మొనర్చి యచట తేయాకు తోటలలోని కార్మికుల సమస్యల నవగాహనము చేసికొని వానికిఁ బరిష్కారమార్గముల నన్వేషింప నుద్యుక్తుఁడయ్యెను.

మోతీలాలు మరణించిన పిదపఁగూడ నాతని భార్యయు జవహర్లాలు తల్లియునగు స్వరూపరాణి జాతీయోద్యమములో నుత్సాహము జూపుచు దేశసేవకుఁ దోడ్పడుచుండెను. కాని కోడలగు కమలానెహ్రూ స్వర్గస్థురాలై నప్పటినుండియు నా ధీరురాలు రోగగ్రస్థయయ్యెను. పుత్రుఁడును, పుత్రికలును దేశ మాతసేవలో నిమగ్నులై నందుల కా వీరమాత సంతుష్టిజెంది నను నామె యారోగ్యము దినదినమును క్షీణింపసాగెను. భోగియై, దాతయై, త్యాగియై, దేశనాయకుఁడై స్వాతంత్ర్య యుద్ధమున వీరస్వర్గ మలంకరించిన మహాపురుషుని పత్నిగను, మూడుసార్లు రాష్ట్రపతి గౌరవమునంది యోధాగ్రేసరుఁడును

నేకపుత్రుండునగు జవహర్లాలునకును భారతదేశ వీరనారీమణులకు తలమానికమనంబరగి, మన దేశమున మంత్రిపదవిని నిర్వహించిన మొదటి మహిళయైన విజయలక్ష్మికిని మాతగను ధన్యజీవియైన స్వరూపరాణి 1938 వ సంవత్సరము జనవరి నెలలో కీర్తి శేషురాలయ్యెను. ఘోరమగు మాతృవియోగముచే శోకసంతప్తమానసుండైన జవహర్లాలు తల్లికి నుత్తర క్రియలను శిష్టాచారము ననుసరించి, నెరవేర్చి పురల జాతీయ కార్యనిమగ్నుఁడయ్యెను.

## 24. సంస్థానప్రజాసభ – ప్రాచ్యదేశ సంచారము

బ్రిటిషు పరిపాలనలో మన దేశమున సుమారు ఆరు వందల స్వదేశసంస్థానములుండెను. స్వదేశ సంస్థానాధీశులు బ్రిటిషుపాలకుల చేతి కీలుబొమ్మలుగ నుండిరి. ఒకవైపున బ్రిటిషువారికి దాసులై మరియొకవైపున వారు తమ ప్రజలపై నిరంకుశాధికారము చలాయించుచుండిరి. వీరిలో నెక్కువ మంది భోగపరాయణులు, బీదరైతులనుండి బలత్కారముగ వసూలుచేసిన ధనమును లక్షలకొలదిగ విలాసములలోను, వినోదములలోను ఇంగ్లండు, ఫ్రాన్సు మున్నగు విదేశములలో ఖర్చు చేయుచుండిరి. సంస్థానప్రజల కడగండ్లు అంతకంతకు మితిమీరుచుండెను. బ్రిటిషు వారందెట్టి జోక్యమును కలిగించుకొనలేదు. అంతేగాక స్వాతంత్ర్యాభిప్రాయములు గల్గి ప్రజా

సౌఖ్యమునుగోరి పాలించుచుండిన నాభారాజువంటివారిని పదభ్రష్టులఁ జేయుచుండిరి.

ఇట్టి పరిస్థితులు చక్కఁబరచు నుద్దేశ్యముతో 1936 వ సంవత్సరమున అఖిలభారత స్వదేశసంస్థాన ప్రజాసభ జరుప బడెను. 1939 వ సంవత్సరమున జరిగిన సాంవత్సరిక సంస్థాన ప్రజాసభకు జవహర్లా లధ్యక్షుఁడుగ నెన్నుకొనఁబడెను. జవహ ర్లాలు స్వతస్సిద్ధముగ సామ్యవాది. కనుక అనువంశికపాలన మును, నిరంకుశప్రభుత్వమును అతఁ డెంతమాత్రమును సహింపఁడు. సంస్థానప్రజల సమస్యలలో జవహర్లాలు విశేష ముగ శ్రద్ధవహించి సంస్థానములలో సుపరిపాలన మేర్పడుట కును ప్రజాక్షేమము వృద్ధి జెందుటకును ప్రజానుమతితో సంస్థానములలోపరిపాలన జరుగునట్లు చేయుటకును జవహర్లాలు కృషిచేసి సంస్థానప్రజలలో నూతనచైతన్యము గల్గించి తమ హక్కుల విషయమై వారికి ప్రబోధము కల్గించెను.

ఆసియాయందలి ప్రాచ్యదేశవాసులకును భారతీయు లకును మైత్రి వృద్ధిచేయుటలో గూడ నీ సమయమున జవహ ర్లాలు శ్రద్ధ వహించెను. 1935 వ సంవత్సరపు రాజ్యాంగశాస నమునుఁబట్టి బర్మా మనదేశమునుండి విడిపోయినప్పటినుం డియు స్వార్థపరులగు బర్మీయులు కొందరచటి భారతీయులను బాధింపఁ జొచ్చిరి. 1938 వ సంవత్సరము మేనెలలో జవహ ర్లాలు రంగూనునకు వెడలి బర్మా ప్రభుత్వముతోను ప్రజా ప్రతినిధులతోను సంప్రదించి సామరస్యమునకు యత్నించెను. పిదప సాంఘిక కలహములు కొంతవరకచట చల్లారినవి. తర్వాత జవహర్లాలు మలయప్రాంతములలోను సంచారము

జరపి అచటి ప్రజలకు భారతదేశముతో స్నేహాభావమును కల్గించెను.

ఇట్లుండగా సింహళద్వీపముననున్న స్వదేశీయులకును భారతీయులకును కొన్ని కలతలేర్పడెను. అచటి భారతీయులకు ఎన్నికహక్కు లేకుండఁ జేయుటకును వ్యాపార సౌకర్యములు తొలగించుటకును సింహళులు యత్నించిరి. అంతట సింహళమున భారతీయుల హక్కులను కాపాడు విషయమున కృషిచేయుటకు కాంగ్రెసు సంఘమువారు జవహర్లాలును నియమించిరి. వెంటనే నెహ్రూ సింహళమునకు వెడలి అచటి మంత్రులతోను, ప్రజానాయకులతోను మాటలాడి సింహళులకును భారతీయులకును, సుహృద్భావము పెంపొందునట్లచటి పరిస్థితులలో సుముఖత్వమేర్పరచి మాతృదేశమునకు మరలెను.

**1937** వ సంవత్సరమున జపానువారు రాజ్యకాంక్షచే పాశ్చాత్యుల సామ్రాజ్యతత్త్వము నుదాహరణగ జేసికొని పొరుగుదేశమగు చీనాపై అన్యాయముగ దాడి జరుపఁ జొచ్చిరి. సాధువులగు చీనావారిపై అక్రమముగ జపానీయులు దండయాత్ర జరపుట అవినీతికరమని జవహర్లాలు తన యభిప్రాయమును వ్యక్తపరచెను. అతని ప్రోత్సాహముమీదనే **1937** సంవత్సరమున మనదేశమున చీనాసహాయక సంఘమేర్పడెను. జవహర్లాలు బావమరిదియగు హుథీసింగును, జవహర్లాలు సహపాఠియగు డాక్టరు అతల్‌ను కలసి యొక వైద్యదళమును చీనాకు తీసికొనివెళ్ళి యచటి బాధితులకుఁ దోడ్పడిరి.

1939 వ సంవత్సరము ఆగష్టునెలలో చీనా ప్రభుత్వ కోరికపై జవహర్లాలు విమానములో బర్మా సయాము దేశములద్వారా నైఋతి-చీనాలో ప్రవేశించి అప్పటి చీనా రాజధానియగు చుంకింగునందు చీనాప్రభుత్వపు అధ్యక్షున కతిథియై అచటి యుద్ధపద్ధతులను, రక్షణకార్యములను స్వయముగఁ బరిశీలించెను. అప్పుడా ప్రాంతము శత్రువుల విమానపు దాడులకు గురియై ప్రమాదస్థితిలోనుండెను. కాని జవహర్లాలు అచంచల ధైర్యసాహసములతో నచటఁ బర్యటనము చేసెను. చుంకింగు రేడియోద్వారా మనదేశీయుల తరఫున చీనావాసులకు స్నేహసహాయసందేశము జవహర్లాలు పంపెను.

ఇంతలో యూరపునందు యుద్ధజ్వాలలు చెలరేగి సెప్టెంబరు ఆరంభమున జర్మనీకిని బ్రిటనునకు సమరము పొసఁగెను. అట్టిస్థితిలో మనదేశపు రాజకీయము లందును విషమపరిస్థితు లేర్పడెను. కావున వెంటనే బయలుదేరి స్వదేశము చేరవలెనని జవహర్లాలునకు కాంగ్రెసు అధ్యక్షుని యాదేశము మాస్కో-రేడియోద్వారా చేరగానే చీనాలో తన కార్యక్రమును నిలిపివేసి విమానముపై జవహర్లాలు స్వదేశము చేరెను.

---

## 25. యుద్ధకాలము

జవహర్లాలుకుమార్తెయగు ఇందిర మాతృవియోగము పొందినప్పటినుండియు ఐరోపాఖండమందే విద్యాభ్యాసము చేయుచుండెను; కనుక పుత్రిక నొకసారి చూచివచ్చుటకై

యుతఁడు 1938 చివరిభాగమున నైరోపాకుఁ బయనమయ్యెను. అప్పటికి ఐరోపాలోని రాజకీయపరిస్థితులు చాలక్లిష్టముగ నుండెను. జర్మనీలో హిట్లరు నియంతృత్వమును, ఇటలీలో ముసోలినీ నియంతృత్వమును విజృంభించుచుండెను. స్పెయినులో ప్రజాపాలనను కూలద్రోసి ఫ్రాంకో అను నియంత అధికారములోనికి వచ్చుచుండెను. స్పెయిను అంతర్యుద్ధ పరిస్థితులను జవహర్లా లచటికి స్వయముగ వెళ్ళిచూచెను. రష్యాలో సామ్యవాద ప్రభుత్వపద్ధతి అమలులోనున్నను స్టాలిన్ నియంతగనే పాలించుచుండెను. పెట్టుబడిదారుల ప్రభుత్వమును సామ్రాజ్యతత్వమును ప్రధానముగాగల బ్రిటను దేశము ప్రజాస్వామ్యవాదముపై నాధారపడిన రష్యాను ప్రభుత్వము నాశనమొందవలెనని కోరుచుండెను. తాము ప్రత్యక్షముగా రష్యాతో విరోధము పెట్టుకొనక హిట్లరు మున్నగు నియంతలచే రష్యాను కూలద్రోయించవలెనని బ్రిటిషువా రాలోచించుచుండిరి,

ఇట్టి రాజకీయతంత్రములన్నియు జవహర్లాలు ఐరోపాలో నున్నపుడు గమనించెను. హిట్లరుయొక్క నాజీ నిరంకుశత్వమును, ముసోలినీయొక్క ఫాసిస్టునిరంకుశత్వమును అనర్థములే. ప్రపంచమున కరిష్టదాయకములే. అనేక విధముల కుటిలరాజనీతి నవలంబించు బ్రిటిషువారి సామ్రాజ్యతత్త్వము గూడ లోకకంటకమైనదే. మొత్తముమీద ఐరోపారాజ్యముల వారందరును స్వలాభపరులై ఆసియా, ఆఫ్రికా మొదలగు ఖండములందలి బలహీనులను స్వార్థముతో, పీడించుటయే ఆశయముగ నుంచుకొనుచుండిరని జవహర్లాలు నిర్ధారణ చేసుకొనెను.

జవహార్లాలు ఐరోపాకు 1936 వ సంవత్సరమున వెళ్ళి నపుడును, 1938వ సంవత్సరమున వెళ్ళినపుడును గూడ జర్మనీ యందలి నాజీప్రభుత్వ మీ విఖ్యాత భారతీయనాయకుఁడు తమ దేశమువచ్చి యచటి పరిస్థితులు గమనించుట కిచ్చగించి నచో తాము హృదయపూర్వకమగు స్వాగతమిచ్చెదమని తెలిపిరి. కాని నిరంకుశత్వమునకు సహజవిరోధియగు జవహార్లాలు అప్పటి జర్మను ప్రభుత్వముతో నెట్టి సంబంధమును పెట్టుకొన నుత్సహింపలేదు. జర్మనీలోని భారతీయవిద్యార్థులను కొందరిని సందర్శించుటకును డ్యూస్సెల్డార్ఫ్‌యమును తన కుమార్తెయగు ఇందిరతోఁగూడఁ దిలకించుటకును జర్మనీ యందలి మ్యూనిచ్ నగరమున నతఁడు రెండు దినములాగెను; కాని యచటి యధికారులతో నెట్టి సంపర్కమును కలిగించుకొనలేదు.

ఐరోపానుండి భారతదేశమునకుఁ దిరిగివచ్చుచు నిటలీ ముఖ్యపట్టణమగు రోమునగరపు విమానాశ్రయమార్గమున రావలసియుండి జవహార్లా లానగరమున రెండుగంట లాగవలసివచ్చెను. ఆ సమయమున ఫాసిస్టు ప్రభుత్వోద్యోగి యొకఁడు జవహార్లాలువద్దకువచ్చి యిటలీ నియంతయగు ముసోలినీ జవహార్లాలునకు దర్శనమిచ్చుట కుత్సహించుచున్నాఁడని తెలిపెను. కాని జవహార్లాలు తనకు ముసోలినీ సందర్శనము చేయు నుద్దేశ మెంతమాత్రమును లేదని మొగమోటమిలేక వక్కాణించెను. జవహార్లాలు భారతదేశముచేరిన కొలది కాలముననే ద్వితీయ ప్రపంచసంగ్రామ మారంభమయ్యెను. (సెప్టెంబరు, 1939) ఆ యుద్ధఫలితముగ నేర్పడిన క్లిష్టమగు

నంతర్జాతీయ పరిణామములో భారతదేశపు స్థాన మేదియని వితర్కించుకొని, కాంగ్రెసుపక్షమువా రవలంబింపఁదగు భావి కార్యక్రమము నతఁడు నిశ్చయింపఁదొడఁగెను. "యూరపు రాజ్యములు స్వార్థపరత్వముతో సాగించు సామ్రాజ్యతత్త్వ పూరిత సంగ్రామములకు భారతీయులు తోడ్పడఁబోరని జవహర్లాలు సూచనపై కాంగ్రెసువారు తీర్మానించిరి. కాని విచిత్రమేమనఁగా యుద్ధమారంభించుటకుముందుగనే బ్రిటిషు ప్రభుత్వమువారు కెనడా, దక్షిణాఫ్రికా మున్నగు అధినివేశ రాజ్యములతో సంప్రతించి యుద్ధారంభమున కారాజ్యముల యంగీకారమును గైకొనిరి. కాని బ్రిటిషుమంత్రులు భారత ప్రభుత్వముతోఁగాని, రాష్ట్రీయమంత్రులతోఁగాని యణుమాత్ర మును ప్రశంసచేయకనే భారతదేశమును ఘోరయుద్ధమున దింపిరి. యుద్ధమారంభమగుటకు నెలదినములు ముందుగనే మన సేనలను సింగపూరువంటి కీలకస్థానములకు జేర్చిరి. ఇండియా గవర్నమెంటువారు గవర్నర్లద్వారా రాష్ట్రము లందలి ప్రభుత్వశాఖల కన్నిఁటికిని యుద్ధకార్యములం దప్రమత్తులై యుండవలెనని యుత్తర్వుల నంపిరి.

ప్రపంచ యుద్ధములోనికిఁ దిగుట భారతదేశమునకుఁ గష్టకరము. రాష్ట్రీయమంత్రులతో నాలోచనచేయకయే రాష్ట్ర ప్రభుత్వముచే యుద్ధకార్యములు చేయించుట మంత్రుల కవ మానకరము. ఇవన్నియు నట్లుండఁగా మంత్రుల కార్యక్రమ ములో జోక్యము కలిగించుకొనఁబోమని గవర్నరు జనరలు చేసిన వాగ్దానమునకు ఇండియా ప్రభుత్వ చర్య భంగకరము. ఇట్టి విపరీత పరిస్థితులలోఁగూడ గాంధిమహాత్ముఁడు బ్రిటిషు

ప్రభుత్వముపై సానుభూతిచూపి వైరాభిప్రాయితో సుముఖముగ కార్యసాధనకొఱకు సామరస్యముగ మాటలాడదలఁచెను. కాని మహాత్ముని హితవచనములు బ్రిటిషు పరిపాలకులకు రోగికి పథ్యమువలె రుచింపలేదు. అంతట గాంధీమహాత్ముఁడును, జవహర్లాలును చేసిన సూచన ననుసరించి కాంగ్రెసు మంత్రులు తమ పదవులకు రాజీనామానీయవలెనని కాంగ్రెసు కార్యవర్గమువారు నిర్ణయించిరి.

పిదప జరగిన రామగరు కాంగ్రెసు సమావేశములో యుద్ధవిషయమున కాంగ్రెసు అభిప్రాయ ప్రకటననుగూర్చి వాదోపవాదములు బయలుదేరెను. "తామేయుద్దేశ్యముతో నీయుద్ధమును చేయుచున్నారో బ్రిటిషువారు ప్రకటింపవలెను. లోకమునందు ప్రజాయత్తపాలనమును సంరక్షించుటకే వారీ యుద్ధమును సాగించుచున్నపక్షమున, తమ యధీనములోనున్న భారతదేశమునకు యుద్ధానంతరమైనను స్వతంత్ర రాజ్యాంగ మిచ్చుటకు బ్రిటిషుప్రభుత్వము వాగ్దానము చేసినట్లయిననే భారతీయులు యుద్ధమున సహకరింతురు. లేనిచో వెంటనే సత్యాగ్రహ మారంభించుటయే భారతీయుల కర్తవ్యము" అని జవహర్లా లభిప్రాయపడెను.

"బ్రిటిషువారు మనతో సమాధానమేర్పరచుకొన్నను మనము ఈ యుద్ధమున బ్రిటిషువారికి నైతికసహాయమునేగాని రక్తపాతముతోఁగూడిన చర్యలలోఁ బాల్గొని బ్రిటిషువారికిఁ దోడ్పడరాదు. ఒకవేళ సమాధానము కుదురకపోయినను బ్రిటిషువారిపు డాపత్సమయములో నుండుటచే వెంటనే సత్యాగ్రహము చేయరాద"ని గాంధిమహాత్ముఁ డనెను.

ఇట్టిస్థితిలో కాంగ్రెసువాదులలో నధిక సంఖ్యాకులు జవహర్లా లభిప్రాయమునే యామోదించిరి.

కాంగ్రెసు తీర్మానమునకు సమాధానముగ బ్రిటిషు వారు కట్టు విరుగకుండను, పాము చావకుండను నీళ్లు నమలు మాటలే చెప్పిరి. ప్రజాయుత్త పరిపాలననుగూర్చి బ్రిటిషు వారు పదేపదే నొలుగెత్తి యెన్ని పర్యాయములు చాటినను అది వారిదృష్టిలో యూరపురాజ్యములకే వర్తించునుగాని, భారత దేశమునకు సంబంధింపదు — అని జవహర్లాలు మొదటనే గుర్తించెను. సమిష్టిసత్యాగ్రహము జరపుటయే కర్తవ్యమని జవహర్లా లుద్దేశించెనుగాని గాంధిమహాత్ముడు వ్యక్తి సత్యాగ్రహము జరపుటకు నిశ్చయించెను.

ఆచార్య వినోబాభావే వ్యక్తిసత్యాగ్రహమున కారంభకునిగ మహాత్ముడు నిర్ణయముచేసెను. ద్వితీయ స్థానమును జవహర్లా లాక్రమింప గోరెను. కాని ఈ లోపుగనే వెనుక నొకప్పుడు గోరకపురమున జవహర్లాలిచ్చిన యుపన్యాసము యుద్ధకార్యముల కాటంకమని తలచి ప్రభుత్వమువా రతని నరెస్టుచేసి నాలుగుసంవత్సరములు కఠినశిక్ష విధించిరి. ఇది జవహర్లాలునకు ఎనిదవపర్యాయము జైలుయాత్ర. ఇంతటి దారుణశిక్ష విధించినందులకు పాశ్చాత్యులుగూడ చకితులైరి.

రెండేండ్లు రమారమి యుద్ధము సాగినమీదట జపాను గూడ బ్రిటిషువారికి శత్రువై జర్మనీ పక్షమున సంగ్రామమున ప్రవేశించెను. జపానువారు కొలదికాలముననే మలయా సుమిత్ర, జావాలను జయించి, బ్రిటిషువారు యభేద్యమను కొనిన సింగపూరు దుర్గమునుగూడ నవలీలగ వశపరచుకొనిరి.

జపాను సేనలు భారతదేశమునఁగూడ ప్రవేశింపవచ్చునని బ్రిటిషు రాజనీతిజ్ఞు లనుమానించిరి. ఈ క్లిష్టపరిస్థితిలో భారత నాయకులు భారతప్రభుత్వపు మంత్రిత్వము నిర్వహింపఁ దగునని బ్రిటిషుమంత్రులు సూచించిరి. మిగిలిన శిక్షను రద్దుచేసి 4-12-41 వ తేదీని జవహర్లాలును బ్రిటిషుప్రభుత్వమువారు ఖైదునుండి విడుదలచేసిరి.

బ్రిటిషు వారిసూచననుబట్టి కాంగ్రెసునాయకులుమంత్రి పదవుల నిర్వహించు సమస్య తిరిగి యేర్పడినది. హింసా కృత్యములలోఁబాల్గొని బ్రిటిషు వారికి యుద్ధములో కాంగ్రెసువారు తోడ్పడరాదనియే తిరిగి గాంధిమహాత్ముఁ డభిప్రాయపడెను. ఈ క్లిష్టసమయమునందు మనము యుద్ధనిర్వహణమునఁ దోడ్పడకున్నచో "బయటిశత్రువు దేశమున ప్రవేశింప సిద్ధముగనున్నపుడుగూడ భారతదేశనాయకులు స్వదేశమును రక్షించుకొను బాధ్యతవహింపలేదను యపనిందపాలుగావలసి వచ్చును. పౌరుషహీనులును భీరువులు నగు భారతీయులు స్వాతంత్ర్యమున కెన్నఁడును నర్హులుగారని లోకులు పరిహాసింతురు," అని జవహర్లాలు వాదించెను.

జవహర్లాలు యభిప్రాయమునే కాంగ్రెసు ఆమోదించి యొకవేళ బ్రిటిషువారితో సమాధానముకుదిరి యుద్ధమును జాతీయనాయకులు నిర్వహింపవలసివచ్చినచో నా భారము జవహర్లాలే వహింపఁదగును—అనిగూడ కాంగ్రెసువాదులు నిశ్చయించిరి.

1942 వ సంవత్సరము మార్చినాటికి మిత్రమండలి స్థితి చాల విషమముగ పరిణమించెను. భారతజాతీయనాయ

కులతో సమాధానపడి హిందూదేశమును కేంద్రముగఁ జేసి కొని జపానువారి నెదుర్కొనుటయే శరణ్యముగ వారికప్పుడు తోచెను. అందుచే నా యాపత్సమయమున సర్ స్టాఫర్డ్ క్రిప్సు అను నొక రాజనీతిదురంధరుని మన నాయకులతో సంప్రతించుటకు బ్రిటిషుమంత్రివర్గమువారు ఢిల్లీకి బంపిరి. ఇతఁడు బ్రిటిషుపార్లమెంటులో కార్మికనాయకులకంటె తీవ్రమగు నభిప్రాయములుగల సామ్యవాది. రష్యాలో బ్రిటిషు రాయబారిగనుండి, అదివరకు మైత్రితోనుండిన హిట్లరునకు స్టాలినునకును స్పర్థగల్గుటకుఁ దగిన యేర్పాట్లనుచేసి భేదోపాయమును జయప్రదముగ నడిపించెను. ఇతఁడు జవహర్లాలునకు మిత్రుడు.

క్రిప్సు బ్రిటిషు ప్రభుత్వపక్షమున దూతగ మన దేశమునకువచ్చి యొక రాజ్యాంగప్రణాళికను సూచించెను. మన జాతీయనాయకులను మంత్రిపదవులు నిర్వహింపుడని కోరుటయేగాని క్రిప్సు ప్రణాళికలో భారతీయమంత్రులను పూర్తిగ విశ్వసించి వారికి యథార్థమగు నధికారమొసఁగు సూచనలు కన్పింపలేదు. అందుచే క్రిప్సు పథకమును మన దేశమందే పక్షమువారును ఆమోదింపలేదు. బ్రిటిషు రాజనీతిజ్ఞులగు చర్చిలు ప్రభృతుల కూటనీతిని జవహర్లాలు స్పష్టపరచి సమాధానమార్గము భగ్నమగుటకు సామ్రాజ్యతత్త్వమత్తులగు స్వార్థపరులైన బ్రిటిషు రాజ్యాంగవేత్తలే కారకులని విస్పష్టముగ ప్రకటించెను.

అంతట క్రిప్సు స్వదేశమునకు వచ్చినదారినిఁ బోయెను. క్రిప్సురాయబారము మన దేశచరిత్రలో నొక నాటకముగఁ బరిణమించినది.

క్రిప్సు మన దేశమునుండి వెడలిపోయినప్పటినుండియు మన దేశీయుల విషయమై బ్రిటిషువారిధోరణి మరియొక విధముగ మారెను. శత్రుభీతినుండి మన దేశమును సంరక్షించుటలో మన దేశీయులను నమ్ముటకు బదులుగ జపానీయుల దండయాత్రల నాపుటలో బ్రిటిషువారు భారమునంతయు నమెరికాపై విడువ నుద్యుక్తులైరి. అంతేగాక భారతీయులను గూర్చి అమెరికా మున్నగు నాగరిక దేశములలో విషప్రచారము సాగించి భారతీయుల నపకీర్తిపాలు చేయ నుంకించిరి. ఈ స్థితియంతయుఁ జూడగా జవహర్లాలు డోలాయమాన చేతస్కుఁడయ్యెను. ఒకవైపున దేశము ప్రమాదస్థితిలోనున్నది. ప్రజల ప్రాణ ధన మానములను కాపాడవలసియున్నది, అట్టి స్థితిలో విదేశపాలకులు దేశీయులను విశ్వసించుట లేదు. ప్రజోద్యమము నణఁచుటలోఁ జూపిన ప్రతాపము విదేశశత్రువు దేశపుతీరము నాక్రమించుచున్నపుడు బ్రిటిషువారు చూపలేకయున్నారు. దేశీయులు కూడు గుడ్డ లేక నల్లాడుచుండ బలవంతముగ యుద్ధనిధిని, ఆహారద్రవ్యములను సేకరించి, వాని నన్నిఁటిని ప్రజలైచ్ఛికముగనే యిచ్చుచున్నారని ప్రచారము ప్రభుత్వమువారు సాగించుచున్నారు — అని జవహర్లాలు పరితపింపఁజొచ్చెను.

జపానుసేన లోకవేళ మన దేశములో దిగినయెడల మనకర్తవ్యమేమి? ఈక్లిష్టప్రశ్నకు సమాధానము చెప్పవలసిన బాధ్యత ప్రజానాయకులపైఁబడును. శత్రువులను అహింసాపద్ధతిని సాత్త్వికముగనే నిరోధింతుమని గాంధిమహాత్ముఁడు సూచించెను. కాని జవహర్లాలు వేరువిధముగ వితర్కింపసాగెను.

శత్రువులు వచ్చి దేశమధ్యమునఁ బ్రవేశించినప్పుడు క్రమబద్ధమగు సత్యాగ్రహమున కవకాశముండునా? ప్రజల ప్రాణ ధనమాన రక్షణ యా సమయమున సాత్త్వికపద్ధతులవలన సాధ్యమగునా? అంతటను హింసాతత్త్వము ప్రకోపించియున్న తీవ్రస్థితిలో నహింసాయుద్ధ మెంతవర కుపయోగింపఁగలదు? ప్రజాక్షోభ మేర్పడునేమో? కాని, నిరాయుధులగు భారతీయుల కహింసావ్రతముగాక మరి సాధన మేమిగలదు? ఇట్టి క్లిష్టకల్పనలచే జవహర్లా లాందోళితచేతస్కుఁ డయ్యెను.

ఇంతలో శాంతమూర్తియగు గాంధిమహాత్ముఁడును బ్రిటిషువారి కపటనీతికి విసుగుజెంది మధ్యందిన మార్తాండుని వలెఁ బ్రచండతేజోరాశియై దీప్తించెను. బ్రిటిషువారీసమయమున మన దేశమందుండుటయే మనకుఁగల ప్రమాదములన్నింటిలోను గొప్పది. వారి సామ్రాజ్యతత్త్వమే మన దేశమునకు శత్రువుల నాహ్వానించుచున్నది. వారు మన దేశమును వదలిపోయినచో భారతదేశమున కరిష్టముతొలఁగును. అట్లు బ్రిటిషువారు మనదేశమును విడిచి పోవని పక్షమున మనము సత్యాగ్రహమునకు సంసిద్ధులముకావలెను. అని యలుగుటయే యెరుగని మహామహితాత్ముఁ డుద్ఘోషించెను.

గాంధిమహాత్ముని యాదేశమే శరణ్యమని జవహర్లాలు మున్నగు దేశనాయకు లంగీకరించి అఖిలభారత కాంగ్రెసు కార్యవర్గ సమావేశమును 1942 వ సంవత్సరము ఆగస్టునెల 8 వ తేదీని బొంబాయినగరమున జరిపి గాంధిమహాత్ముని యుద్దేశానుసారముగ తీర్మానమును చేసిరి. సత్యాగ్రహ నియంతగ మహాత్మునే ఆ సభవారు నిర్ణయించిరి. సత్యాగ్రహవిధానము

నేర్పరచుకొని ముందుగా భారతదేశపు రాజప్రతినిధికి దానిని గూర్చి తెలియపరచి, అతని సమాధానము తెల్పుట కొకనెల వ్యవధినిచ్చి, యీలోపుగ నవసరమైనచో సంప్రదింపుఁ జరపి సమాధాన ప్రయత్నములు విఫలమైనచో సత్యాగ్రహము జరుపఁబడునని మహాత్ముఁడు ప్రకటించెను.

కాని బ్రిటిషు ప్రభుత్వము వా రంతవర కాగలేదు. అమాయకులును, నిరాయుధులు నగు భారతదేశీయ ప్రజల మీఁదికి బ్రిటిషుపాలకులు నల్లేరుమీఁదికి బండివలె విజృంభించు ప్రజ్ఞావిశేషము గలవారని మరియొకసారి దృష్టాంతీకరించిరి. కాంగ్రెసు తీర్మానము జరిగిన రాత్రి తెల్లవారు లోపుగనే కాంగ్రెసు ప్రముఖులను, మహాత్ముఁడు, జవహర్లాలు మున్నగు పదునాల్గురను అరెస్టుచేసి యెట్టి విచారణయు లేక, అవధి యెట్టిదియుఁ దెలుపక నిర్బంధమున నుంచిరి.

---

## 26. అహమదునగరు నిర్బంధము

బొంబాయినగరమున నరెస్టుచేయఁబడిన పిదప గాంధి మహాత్ముఁడు కొందర నుచరులతో పూనా సమీపమందలి ఆగాఖాను భవనమున నిర్బంధింపఁబడెను. కాని జవహర్లాలును మరికొందరు నాయకులను నెచ్చటనో రహస్యముగ నుంచి చాలకాలమువరకును యథార్థమును ప్రభుత్వము ప్రజలకుఁ దెలియనీయలేదు. నాయకులను ఖండాంతరములకుఁ బంపిరని

కూడ వదంతులు బయలుదేరెను. మధ్యరాష్ట్రములందలి అహమదునగరు దుర్గములో జవహర్లాలు ప్రభృతులను నిర్బంధించిరని కొంతకాలమునకుఁ దెలియవచ్చెను.

ప్రచండ యుద్ధమువలన లోకమును ముఖ్యముగ మాతృదేశమును తల్లడిల్లుచున్న సమయమున మాతృదేశసేవకై జీవితము నర్పణముచేసిన జవహర్లాలునుఁబోలిన ధీరులకు భౌతిక నిర్బంధము కలిగించి, వారి దేశసేవా కార్యకలాపములకు నిరోధముకల్గించుట వ్యక్తిస్వాతంత్ర్యమును పూజించు బ్రిటిషు జాతి రాజనీతికి మిక్కిలి కళంకదాయకము. హిట్లరు,ముసోలినీ, టోజోలవంటి నియంతల నిరంకుశత్వమునుండి లోకము నుద్ధరించి ప్రజాస్వాతంత్ర్యమును కాపాడుదుమని పరిగల్భములను ఆంగ్లరాజ్యాంగ విశారదులు యుద్ధకాలమున పదే పదే పల్కుచుండిరి. కాని యుద్ధమారంభమగుట కింకనుఁ కొలఁది యేండ్లకు పూర్వమే పైన నుదహరించిన నియంతలు ప్రజాస్వత్వముల నణఁచివేసి, పొరుగుననున్న బలహీనరాజ్యములను కబళించుచుండినపుడు లోకరక్షణకుఁ గంకణము కట్టుకొంటిమని బీరములు పల్కిన బ్రిటిషు రాజనీతికోవిదులు మౌనముద్ర వహించియుండిరి. నియంతల దురాక్రమణలు నాగరక లోకమునకు కళంకము, ప్రపంచశాంతికి ప్రమాదకరమని యౌవనమునందే మొగమోటములేక విస్పష్టముగా ధీరుఁడగు జవహర్లా లుద్ఘోషించెను. ఆ ప్రతిభాశాలి యట్లు హెచ్చరిక చేయగాఁ నట్టిభీతికిఁ దావులేదనియు, నట్టియూహ లేనిపోని కలవరమును కల్గించుననియు పాశ్చాత్య రాజ్యాంగవేత్తలపహసించిరి. తుదకా నియంతల ఘాతుకచర్య లగ్నిపర్వత

జ్వాలలవలె ప్రపంచ మంతటికిని ఆవరించిన సమయమున ప్రజాస్వాతంత్ర్యవాదులలో నగ్రగణ్యుడగు జవహర్లాలువంటి నాయకరత్నమును – దేశరక్షణసన్నాహమున కధినేతగనుండఁ దగునని యాతని నర్థించుటకు బదులుగ నేకాంతవాసమున మ్రగ్గఁజేయుబుద్ధి బ్రిటిషు కుటిలరాజనీతిపరుల 'కర్మానుసారిణి' యనుట తథ్యము. ఏ ప్రజాస్వాతంత్ర్యముల విశిష్టతనుగూర్చి నిరంతరము నుచ్చైస్స్వనముతో బ్రిటిషువా రుద్ఘోషించుచుందురో, అట్టి హక్కులు భారతీయులకుగూడ కావలెనని కోరుటయే బ్రిటిషు సామ్రాజ్యవాదుల దృష్టిలో జవహర్లాలుప్రభృతుల నేరమయ్యెను. భారతీయులకు స్వాతంత్ర్యము గల్గిన వెంటనే ప్రజలలో నుత్సాహము రేకెత్తించి, బాధితజాతులగు చీనావాసులు మున్నగువారికినిఁ దోడ్పడవలెనని జవహర్లా లువ్విళ్ళూరుచుండెను. కాని విధిదుర్విపాక మన్యథా పరిణమించెను. 1942 వ సంవత్సరం ఆగస్టునుండి 1945 వ సంవత్సరము జూన్ నెలవరకును జవహర్లాలు అహమ్మదునగర కోటయందే గడుపవలసివచ్చెను. ఆ నిర్బంధకాలపు ఆరంభమున నొక పక్షమువరకును జవహర్లాలునకు బహిఃప్రపంచపు వార్తలేవియు దెలియలేదు, ఏలయన నతని కేవార్తాపత్రికలును ప్రభుత్వము చేరనీయలేదు. మాతృదేశ మెట్టికల్లోలస్థితియందు జిక్కుకొనెనదో, ప్రజ లెట్టి యాతిబాధల పాలైరోయని యా సమయమున జవహర్లాలు మనోవ్యథచే గుందుచుండెను.

కాని జవహర్లాలు నిసర్గధీరుఁడు; ఎట్టి క్లిష్టపరిస్థితులలోను ప్రశాంతచిత్తమును వీడని గభీరహృదయుడు. తోటపని మున్నగు పరిశ్రమలచే శరీరారోగ్యమును గాపాడుకొనుచు

గ్రంథపఠనమునందును, గ్రంథరచనయందును దన కాలమును సద్వినియోగముచేయుచు నహమదునగరు దుర్గమున జవహర్లాలు కాలము వెళ్ళబుచ్చుచుండెను.

అహమదునగరు కోటలోని నిర్బంధము జవహర్లాలున కొక దృక్పథముతో జూచిన నదృష్టముగనే పరిణమించెను. అట్లనుటకు హేతువేమనగా జవహర్లాలుతోబాటు, సుప్రసిద్ధ దేశనాయకులును, విజ్ఞాన శేముషీసంపన్నులు నగు బాబు రాజేంద్రప్రసాద్, మౌలానా అబ్దుల్ కలాం అజాద్, డాక్టర్ పట్టాభి, ఆచార్య నరేంద్రదేవ్, ప్రఫుల్లచంద్రఘోష్ మొదలగు కాంగ్రెసు కార్యసమితి సభ్యులుగూడ అహమదునగరు కోటలోనే నిర్బంధింపబడిరి. తరచుగ నీ ప్రతిభాశాలు రందరును సమావేశమగుచుండిరి. జవహర్లాలు స్వతసిద్ధముగ విజ్ఞానామృతమును గోరిలిన మేధావియైనను అచట పండిత మిత్రతచే నితోధికముగ జ్ఞానసముపార్జనము చేయుటలో నమితశ్రద్ధ బూనెను.

మౌలానా అబ్దుల్ కలాం అజాదునుండి ముస్లింసంస్కృతిని, అరబ్బీసాహిత్యమును, ప్రఫుల్లచంద్రఘోషునుండి వంగీయ సంస్కృతిని, ఆచార్య నరేంద్రదేవు వద్ద పాలి మొదలగు భాషలను, ఖాన్ అబ్దుల్ గఫూర్ ఖాను నుండి పఠానుల సాంఘిక పరిస్థితులను, డాక్టర్ పట్టాభినుండి చర్ఖాశాస్త్రమును, బాబూ రాజేంద్రప్రసాదు నుండి చారిత్రిక విశేషములను— ఇట్లు నానాముఖముల విద్వద్గోష్ఠిని జరపుటకు జవహర్లాలునకు నిర్బంధకాలమున నపూర్వావకాశము లభించెను. జవహర్లాలదివరకు పాశ్చాత్యవిజ్ఞానమున పారంగతుండై యుండెను.

ఇప్పుడు ప్రాచ్య విజ్ఞానముతో సన్నిహిత సంబంధ మెక్కువగ కల్గెను. అందులకు ఫలితముగ నతనికి ప్రాచీన భారతసంస్కృతి పై నాదరము హెచ్చెను. భావసమన్వయమును, ఆధ్యాత్మిక పరిణామమును నేర్పడెను.

---

## 27. యుద్ధపరిసమాప్తి - భారతస్వాతంత్ర్యము

నాయకులను నిర్బంధింపఁగనే మనదేశమున నల్లకల్లోల మేర్పడెను. జాతీయోద్యమము నరికట్టుటకును, బలాత్కారముగనైనను ప్రజలచే యుద్ధసన్నాహములు జరిపించుటకును, ఎన్నియో విపరీతశాసనములను భారతదేశమున బ్రిటిషుద్యోగు లమలుజరిపిరి. సరియగు నాయకులు లేకపోవుటచే జనులుద్రేకపూరితులై రైలుపట్టాలూడఁబెరకుట, టెలిగ్రాఫు తీగెలఁ ద్రెంపుట, తపాలాపెట్టెలు కాల్చివేయుట, ఇట్టిదౌర్జన్య చర్యలు దేశమున వివిధప్రాంతములలో జరుగజొచ్చెను. వీని నణఁచు ప్రయత్నములో ప్రభుత్వోద్యోగు లాందోళనఁ జెంది నిరాయుధ జనులను లాఠీలతోఁ గొట్టియుఁ, దుపాకుల ప్రేల్చియు, విమానదాడులు జరపియు, వార్తాపత్రికల ప్రచురణ నిరోధించియు, సభలపై నాంక్ష విధించియు నిట్లెన్నియో నిర్బంధ చర్యల నవలంబించిరి. దేశమందనేక ప్రాంతములలో ఈతి బాధలు హెచ్చి, ఆహారపదార్థముల కఱవేర్పడి, ధరలు పెరిగి జనసామాన్య మిక్కట్ల పాల్పడెను. తిండిలేక యొక్క బెంగాలులోనే ఇరువదియైదు లక్షలమంది మరణించిరి.

తుట్టతుద కెట్లో భీభత్సమగు సంగ్రామము 1945 వ సంవత్సరము మే నెలలోఁ గొంతవరకు పరిసమాప్తి జెందెను. ఇటలీలో ముసోలినీయును, జర్మనీలో హిట్లరును పరాజయము నొందిరి. జపానీయులు మాత్రము పసిఫికురంగమున బలీయులు గనే యుండిరి. బర్మా, మలయా మొదలగు జపానువారి వశమందున్న ప్రదేశములను తిరిగి స్వాధీన పరచుకొనుటకు భారతసైన్యముల యవసరము గలదనియు, నందులకు భారత జాతీయనాయకులతో సమాధానపడుటయే మార్గమనియు బ్రిటిషువారును కొంత గ్రహించిరి. అమెరికా, చీనా ప్రభుత్వ ముల అధ్యక్షులు నట్టి సలహానే యిచ్చిరి. ఇంతలో బ్రిటను నందు పార్లమెంటు యెన్నికలు జరిగి తత్ఫలితముగ కార్మిక మంత్రివర్గ మేర్పడెను. అందుచే 1945 వ సంవత్సరము జూన్ నెలలో జవహర్లాలుతోఁబాటు గాంధిమహాత్ముఁడు మున్నగు నాయకుల నందరును వదలిరి. వెంటనే రాజప్రతినిధియగు వేవెలు గాంధిమహాత్ముని, జవహర్లాలును, జిన్నాసాహెబును, అదివరలో రాష్ట్రములందు ప్రధానమంత్రులుగ నుండిన వారిని సిమ్లాలో రాజ్యాంగ విషయముల చర్చకై ఆహ్వానించెను. కొన్ని దినములు తీవ్రముగ చర్చలు జరిగినవిగాని తుదకు జిన్నాసాహెబు పట్టుదల వలన సమాధానమార్గ మేర్పడుటకు వీలుకలుగ లేదు.

నాయకులు నిర్బంధముననున్న సమయమున ప్రభుత్వమువారు జరపిన కఠినచర్యలచే ప్రజలు నిరుత్సాహులై యుండిరి. దేశీయులలోఁ గొందరు కేవలము స్వార్థపరాయణులై విదేశప్రభుత్వముతో సహకరించిరి. మరికొందరు తీవ్ర

వాదులు హింసాచర్యలను ప్రోత్సహించుచుండిరి. జవహర్లాలు నిర్బంధమునుండి బయటకు వచ్చిన పిదప దేశమందలి యథార్థమగు స్థితిగతులు గమనించి యనేకరాష్ట్రములలో సంచారము చేసి ప్రజలలో నూతనోత్తేజము గల్గించెను. దేశమునందలి వివిధ భావములను, భిన్నశక్తులను సమన్వయించి ప్రజల నుత్సాహపరవశులఁ జేసి యిఁకపై బ్రిటిషుపరిపాలన భారత దేశమునఁ గొలఁదికాలమైనను సాగనీయరాదను భావము దేశ మం దన్నిమూలలను వ్యాపింపఁజేసెను.

ఇంతలో ప్రభుత్వమువారు అజాద్ హిందఫౌజు నాయకులపై విచారణ జరుప నుద్యుక్తులైరి. నేతాజీ సుభాసు చంద్రబోసుయుద్ధసమయమున మన దేశమునుండి యదృశ్యుఁడై రహస్యముగ జర్మనీ చేరి హిట్లరుతో మాటలాడి, పిదప సింగపూరును చేరి, అచట జపానువారి ఖైదీలుగనున్న భారతీయ సైనికులకు నాయకత్వము వహించి అజాద్ హింద్ఫౌజును (స్వతంత్రభారత సైన్యమును) నిర్మించెను. కాని, తుదకు అమెరికను విమానదళ సహాయముతోఁ బోరుచున్న బ్రిటిషు వారికి అజాద్హింద్ఫౌజు లొంగిపోయెను. అమెరికనులయాటంబాంబు ప్రయోగముతో జపానువారును 1945వ సం॥రము అగస్టులో లొంగిరి. పిదప అజాద్హింద్ఫౌజు నాయకులపై తిరుగుబాటు నేరమునకై రాజప్రతినిధియగు వేవెలు విచారణ జరుప నారంభించెను. అట్లు నేరారోపణచేయుట అక్రమమనియు, ఒకజాతి ప్రజలు దేశస్వాతంత్ర్యమునకై విదేశపరిపాలకులతోఁబోరాడుటలో నేరమేమియు లేదనియు, నందుచే యజాద్హింద్ఫౌజు సైనికులపై విచారణ విరమించుట యుత్తమ మనియు జవ

హర్లా లధికారులకుఁ దెలిపెను. కాని యీ హితోపదేశము
రోగికి పథ్యమువలె రుచింపక పోవుటచే బ్రిటిషుద్యోగులు పెడ
చెవినిబెట్టి ఢిల్లీలోని లాల్ ఖిల్లా (ఎఱ్ఱకోట)లో బ్రహ్మాండమగు
విచారణ జరుప నారంభించిరి. అంతట జవహర్లాలు నేరము
మోపఁబడిన అజాద్ హింద్ ఫౌజు నాయకులు నిర్దోషులని వారి
పక్షమున వాదించుటకై యత్నముచేయుటను కాంగ్రెసు నాయ
కుల నొప్పించెను. వాదనజరుపుటకై సుప్రసిద్ధ న్యాయవాదియు,
కాంగ్రెసు నాయకుఁడు నగు బులాభాయిదేశాయి యధ్వర్య
మున నొక న్యాయవాదిసంఘము నేర్పరచి, దేశ మం దన్ని
ప్రాంతములనుండియు ధనము సేకరించి, సాక్ష్యమున కవసర
మగు పత్రములను జవహర్లాలు సమకూర్చెను. విచారణజరుగు
దినమున ముద్దాయిలతరఫున వాదించు న్యాయవాదులకు
ప్రోత్సాహము కలిగించుటకై యిరువదియైదు సంవత్సరముల
క్రిందట వదలివేసిన న్యాయవాది దుస్తులను ధరించి జవహ
ర్లాలు కోర్టులో హాజరయ్యెను.

జవహర్లాలు ప్రయత్నమునుఁజూచి బ్రిటిషు అధికారులు
మొదట హేళన మొనర్చిరి. కాని యీ సంకల్పసిద్ధుని శక్తి
సామర్థ్యములవలన భారతదేశమందలి మారుమూల గ్రామము
లలోఁగూడ అజాద్ హింద్ ఫౌజు నాయకులవిషయమున వర్ణింప
నలవికాని సానుభూతియేర్పడెను. అజాద్ హింద్ ఫౌజు సైని
కులు శత్రుపక్షమునఁ జేరుటకు బ్రిటిషు సైనికోద్యోగుల
ద్రోహమే కారణమనియు భారతీయ సైనికులను శత్రువశము
జేసి బ్రిటిషు సైన్యాధికారులు విమానములలో సింగపూరు
నుండి యెగిరి, తమ ప్రాణములు దక్కించుకొనిరనియు, అట్టి

స్థితిలో నేదోయొకమార్గమునఁ దప్పించుకొనుట కుద్దేశించిన అజాద్‌హింద్‌ఫౌజు వారియందు నేరమేమియు లేదని బులాభాయి దేశాయి బహు యుక్తిగను, సహేతుకముగను వాదించుసరికి బ్రిటిషు వారి కుటిలచర్యలనుగూర్చి విని ఖండాంతరవాసులు గూడ విభ్రాంతులైరి. విచారణయంతయుఁ బూర్తిచేసి, అజాద్ హింద్‌ఫౌజు నాయకులను రాజ్యప్రతినిధి విడువవలసివచ్చెను. లేనిచో భారతదేశ సైన్యములలో విప్లవముగల్గునను సూచనలు బయలుదేరెను. మొట్టమొదటనే జవహార్లాలు చేసిన హితోపదేశమును నిర్లక్ష్యము చేసినందులకు బ్రిటిషుదోగులు తమలోఁదాము సిగ్గుజెందిరి.

1945 సంవత్సరము జూలై నెలలో బ్రిటనునందు జరిగిన పార్లమెంటు యెన్నికలలో చర్చిలుపక్షమోడి, కార్మికపక్షము వారు విజయమందిరి. యుద్ధఫలితముగ బ్రిటను దేశము చాల కృంగిపోయెను. అదివరకితర దేశములకు అప్పిచ్చుచున్న బ్రిటిషు వారు యుద్ధము ముగియుసరికి యమెరికాకు చాల ఋణగ్రస్థులైరి. అదియట్లుండ భారతదేశమునకు గూడ యుద్ధకాలపు సామగ్రికొరకు రెండువేలకోట్లరూపాయలు బాకీపడిరి. మన దేశమున కప్పటికైనను వెంటనే స్వపరిపాలన యొసఁగనిచోఁ బ్రజలలోనేగాక సైన్యములలోఁగూడ విప్లవము కలుగవచ్చునని యనుమానించుటకుఁ దగిన పరిస్థితులు మనదేశమున నేర్పడెను. కనుక సఖ్యతతోడనే సాధ్యమైనంతత్వరలో బ్రిటిషు వారు భారతదేశమునుండి తరలుటయే యుచితజ్ఞతయని కార్మికపక్ష మంత్రులు నిర్ణయించుకొనిరి. ఆ యుద్దేశముతో మొదట గొందరు పార్లమెంటుసభ్యుల నిచ్చటి స్థితిగతులఁ దెలిసికొను

టకు బ్రిటిషు ప్రభుత్వమువారు బంపిరి. పిదప 1946 వ సంవత్సరము మే నెలలో ముగ్గురు బ్రిటిష్ మంత్రులు మనదేశమున సుమారొక నెలదినము లుండి వివిధపక్షనాయకులతో సంప్రదించి మనదేశపు పరిపాలన విషయమున నొక ప్రణాళిక సూచించిరి. దానినిర్వహణమునకై జవహర్లాలు బొంబాయిలో జిన్నాసాహెబు గృహమునకు బోయి యతని సహకారమును గోరెను. కాని జిన్నాసాహెబు చూపిన మొండివాదమువలనం కాంగ్రెసువారును జిన్నాపక్షమువారును (ముస్లింలీగు) కలసి యీ ప్రణాళికను నిర్వహింప సాధ్యముకాలేదు.

అంతట బ్రిటిషు ప్రభుత్వము సూచించిన పద్ధతుల ననుసరించి కాంగ్రెసుపక్షమువారు మనదేశమున జాతీయ ప్రభుత్వమును నిర్వహించుట కంగీకరించిరి. జాతీయప్రభుత్వ నిర్వహణభారము జవహర్లాలుపై బడెను. కేంద్రప్రభుత్వ కార్యనిర్వాహకవర్గమునకు రాజప్రతినిధి అధ్యక్షుడుగ నుండు టకును, జవహర్లాలు ఉపాధ్యక్షుడుగ వ్యవహరించి, యతడు మరికొందరు మంత్రులను నియమించుకొని వివిధశాఖలు పాలించుటకును యేర్పాటు జరిగెను. ఈ విధానము ననుసరించి జవహర్లాలు నెహ్రూ తన యనుచరులతోం గలసి ఆంతరియ జాతీయప్రభుత్వనిర్వహణము 1946 వ సంవత్సరము నవంబరు నెలలో నారంభించెను. నెహ్రూనాయకత్వమున నీ మిత్ర మండలివారు కేంద్రపరిపాలనలో క్రొత్తసాంప్రదాయముల ననేక మేర్పరచిరి. అదివరకు సాధారణముగ ప్రభుత్వశాఖ లన్నియు ఐ.సి. యస్. వర్గమునకు జెందిన బ్రిటిషుద్యోగులచేత నుండెను. వారి కిష్టమైనచో కార్యాలయమునకు వచ్చుచుండెడి

వారు; లేనిచో మారుచుండిరి. పరిపాలనా నీతి యంతయు నింగ్లండు క్షేమమునే ప్రధానముగ నుంచుకొని అమలు జరుపబడుచుండెను. నెహ్రూనాయకత్వమున నదియంతయుఁ మార్పుజెందెను. మంత్రులందరును పదునొకండు గంటలకు సరిగా నిత్యమును కార్యాలయముచేరి శ్రద్ధతోఁ తమతమ శాఖల నడుపుచు, ప్రతి సాయంకాలమును మంత్రివర్గసభలు జరిపి వివిధశాఖల కార్యక్రమము సమన్వయముచేసికొని జాతీయ దృక్పథముతో పరిపాలన నడుపుచుండిరి.

ఈ సమయముననే బ్రిటిషు ప్రభుత్వాహ్వానముపై జవహర్లాలు రాజప్రతినిధి జిన్నాలతోఁ గలసి లండను వెడలి భావిరాజ్యాంగ విషయము నచటి బ్రిటిషుమంత్రులతోఁ జర్చించెను. మనదేశమున ప్రజాప్రతినిధులతోఁ గూడిన రాజ్యాంగపరిషత్తు (కాన్‌స్టిట్యుయెంటు అసెంబ్లి) నేర్పరచి భారతరాజ్యాంగ విధానము రచించుటకు నిశ్చయింపఁబడెను. అట్టి పరిషత్తు ఆరంభమునాటికి జవహర్లాలు లండనునుండి భారతదేశమునకు దిరిగివచ్చెను.

నాయకులు నిర్బంధములోనుండఁగా కాంగ్రెసంస్థ కార్యక్రమము సరిగా జరుగుటకు వీలుకాలేదు. అందుచే 1945 వ సంవత్సరమున కాంగ్రెసు పునర్నిర్మాణ మవసర మయ్యెను. ఆ కార్యకలాపములు జరుపుటకు జవహర్లాలే యుక్తుఁడని నిశ్చయించి యితర నాయకులందరును కాంగ్రెసు అధ్యక్షునిగ నియమించిరి.

ఇంతలో దేశమునందు హిందూ మహమ్మదీయ విభేదము లధికమై క్రమముగా మత విద్వేషములుగఁ బరిణమించి

దేశమం దచ్చటచ్చట ర క్తపాతము జరిగెను. హిందువులును మహామ్మదీయులును పరస్పరము హత్యలు గావించుకొనిరి. జిన్నాసాహెబు నాయకత్వమున ముస్లింలీగువారు భారతదేశమును రెండుగాఁజీల్చి మహామ్మదీయు లెక్కువగాఁగల ప్రాంతములను చేర్చి పాకిస్థాను అను ప్రత్యేకరాజ్య మేర్పరుపవలెనని పట్టుబట్టిరి. ఇట్లు దేశమును రెండుభాగములుగ విభజించు పద్ధతిపై బ్రిటిషువారు భారతదేశమునకు స్వపరిపాలన మిచ్చి వెడలిపోవుటకు సిద్ధముగనున్నారని బ్రిటిషు మంత్రివర్గము వారు ప్రకటించిరి.

ప్రాచీనవైభవోపేతమగు భారతదేశమును రెండుగా ఖండించుటగాంధీమహాత్ముఁడు జవహర్లాలువంటి నాయకులకుఁ గష్టముగఁదోఁచెను. కాని యేదోవిధముగ దేశమున స్వపరిపాలన మేర్పడినచో దేశీయుల బాధలు తగ్గునను విశ్వాసముతో నాయకులు దేశవిభజన విధాన మంగీకరించిరి. దీని ననుసరించి 15-8-1948 వ తేదీనుండి భారతదేశమున ఇండియన్ యూనియన్, పాకిస్థాను అను రెండు అధినివేశరాజ్యము లేర్పడెను.

1947 వ సంవత్సరము ఆగష్టు 15 వ తేదీనుండి భారతదేశము స్వాతంత్ర్యమును పొందినది. గాంధి మహాత్ముని యహింసా దీక్షకును, నెహ్రూకుటుంబమువారు మున్నగు దేశసేవాపరాయణులు లొనర్చిన త్యాగమునకును ఫలము చేకూరినది.

---

## 28. మొదటి భారతప్రధాని

14-8-47 అర్ధరాత్రమునుండి భారతదేశపు పరిపాలన పూర్తిగ మనదేశీయుల హస్తగతమైనది. ఆ శుభసమయమున సమావేశమైన రాజ్యాంగ పరిషత్సభలో పండిత జవహర్లాలు నెహ్రూ స్వతంత్రభారత ప్రథమ ప్రధానమంత్రిగ సేకగీవముగ నెన్నుకొనఁబడెను. స్వతంత్ర భారత చిహ్నమగు అశోక చక్రముద్రిత త్రివర్ణ పతాకమును ఢిల్లీయందలి రాజ్యాంగభవనముపై జవహర్లాలు నెహ్రూ ప్రతిష్ఠించెను. ఆ సమావేశమునందే యప్పటి గవర్నరుజనరలగు మౌంటుబాటెన్, భారత ప్రధాన న్యాయమూర్తి కానియా మున్నగువారి యెదుట భారతరాజ్యాంగ ప్రధానిగ జవహర్లాలు ప్రమాణ స్వీకారమొనర్చెను. విదేశాంగశాఖను తాను నిర్వహించుచు మిగిలిన ప్రభుత్వశాఖల కర్తృలును, ప్రజ్ఞాశాలురునగు దేశనాయకులను మంత్రులుగ జవహర్లాలు నియమించెను.

జవహర్లాలు ప్రధానమంత్రిపదవి స్వీకరించుసరికి దేశము చాల క్లిష్టపరిస్థితులలో నుండెను. ఎటుజూచినను విషమ సమస్యలే. ఒకవైపున దేశవిభజనచే నెన్నియో క్రొత్తచిక్కులు గల్గినవి. పాకిస్థానులోనుండిన హిందువులచట ప్రబలురుగా నున్న మహమ్మదీయుల దౌర్జన్యచర్యలకు భీతిఁజెంది భారత ప్రభుత్వముక్రిందకు రాగోరిరి. ఇచ్చటి మహమ్మదీయులు కొందరు పాకిస్థానమునకు వెడలఁగోరిరి. ఈ విధముగ జనాభా మార్పిడి జరుగు సమయమున హిందువులును మహమ్మదీయులును పరస్పరము హింసాచర్యలు జరుపుకొనిరి. ఎందరికో

ప్రాణ ధనములు నష్టమగుటయే గాక, కొన్ని కుటుంబములలోని స్త్రీలును పిల్లలును యపహరింపబడిరి. కూడుగుడ్డలు లేక నిలుచుటకు నీడ లేక పాకిస్థానమునుండి భారతదేశమున కావిధముగ సుమారు నలుబది లక్షలమంది శరణార్థులై ప్రాణముల నరచేతఁ బెట్టుకొని చేరిరి. ఈ శరణార్థులకందరకును పునరావాసము కల్గించు బాధ్యత నెహ్రూ ప్రభుత్వముమీదఁ బడెను.

లోకభీకరమగు యుద్ధఫలితముగ దేశమందలి ప్రజలకు తిండికిని, బట్టకును కఱవయ్యెను. మన దేశపు పంట మన ప్రజలకు సరిపోవుట లేదు. అందుచే విదేశములనుండి యాహార పదార్థములను విపరీతమగు హెచ్చుధరలకుఁ గొని దిగుమతి చేసి ప్రజలకు సరఫరా చేయవలసివచ్చినది. యుద్ధకాలమున బట్టలయంత్రములన్నియు సైనికుల యుపయోగమునకే విదేశపాలకులు వినియోగించిరి. ఆ మిల్లులను తిరిగి ప్రజోపయోగమగునట్లు మార్చి వస్త్రములను జనసామాన్యమున కందుబాటులోనికిఁ దేవలసివచ్చెను.

ఇవి యిట్లుండగా స్వదేశ సంస్థానములవలనఁ గొన్ని చిక్కులుగలిగెను. విదేశపరిపాలనలో సంస్థాన ప్రభువులు నిరంకుశ పాలనమున కలవాటు పడియుండిరి. దేశమునకు స్వాతంత్ర్యము లభించినపిదప సంస్థానములలోఁ గూడ ప్రజాయుత్త పాలన మేర్పడవలసివచ్చెను. కాని కొందరు సంస్థానాధీశులకుఁ తమ యధికారమును వదలుట కిష్టము లేదు. బ్రిటిషువారు మన దేశమును వదలునరికి మనదేశమునఁ గల సుమారు రారువందల సంస్థానాధీశులను నయముననో భయముననో ప్రజాపరిపాలన కంగీకరింపఁ జేయవలసివచ్చెను.

దేశవిభజన ఫలితముగ నేర్పడిన పాకిస్థానురాజ్యము భారతప్రభుత్వముపై కొన్ని ముఖ్య విషయములలో శత్రు భావమును బూనెను. హైదరాబాదు నైజామును ప్రోత్సహించి భారతప్రభుత్వముపై గత్తిగట్టునట్లు ప్రేరేపించెను. హైదరాబాదురాజ్యములో నాటికి ఎనుబదియైనమంది హిందువులు, పంద్రెండుగురుమాత్రమే మహమ్మదీయులు. అయినప్పటికిని అల్పసంఖ్యాకులగు మహమ్మదీయులు హిందువులపై దౌర్జన్యచర్యలు జరపి హింసాకాండను ప్రవర్తింపజేసిరి. కాశ్మీరరాజ్యము పాకిస్థానమునకు సరిహద్దులో నున్నది. ఆ దేశమును తమ రాజ్యమునఁ జేర్చుకొను దురుద్దేశ్యముతోఁ బాకిస్థాను ప్రభుత్వమువారు కాశ్మీరు సరిహద్దునందలి కొండ జాతివారిని ప్రేరేపించి తాము రహస్యముగ సైనిక సహాయమును జేసి దొంగపోటుగ కాశ్మీరముపై దండెత్తి యచటి ప్రజలలోఁ గలవరము కల్గించిరి. భారతదేశపు శిరోభూషణ మగు కాశ్మీరమును నిరపాయముగఁ జేయు భారము నెహ్రూ మంత్రివర్గముపైఁ బడెను. ఈక్లిష్టసమస్యను పరిష్కరించుటకు జవహర్లాలు సామ దాన భేద దండోపాయముల నుచితరీతిగఁ బ్రదర్శించి, యెంతయో చాకచక్యముగఁ బ్రవర్తింపవలసి వచ్చుచున్నది,

సుమారు రెండువందలయేండ్లు మనదేశమును పాలించి దేశాదాయమందు సగభాగము, అనగా సంవత్సరమున కరువది కోట్లరూప్యములు సైనికశాఖకే వ్యయపరచి తుదకు జపాను వారు మనదేశముపై దండెత్తునప్పటికి దేశమును రక్షించుటకొక విమానముగాని, ఓడగాని లేకుండ బ్రిటిషు ప్రభుత్వమువారు

అధ్వాన్నస్థితిలో వదలిపోయిరి. దౌర్జన్యమే ప్రధానముగాగల యీ కాలమున దేశమును శత్రువులనుండి సంరక్షించుకొనుట కాధునిక యుద్ధపరికరము లత్యవసరము. ఇవియన్నియు సమకూర్చుకొనుట ప్రభుత్వమునకు ముఖ్యకర్తవ్యము.

ప్రధానముగ మనదేశము విదేశపాలనలో ఆర్థికవిషయములందు దుస్థితిలోఁ బడిపోయినది. దానికిఁదోడు యుద్ధకాలమున ధరలు విపరీతముగఁ బెరిగినవి. యుద్ధావసరములనే ముఖ్యముగఁ జూచుకొని ప్రజాక్షేమము గుర్తింపక విదేశ పరిపాలకులు విలువగల నాణెములను మాయముచేసి కాగితపు కరెన్సీని వ్యాపింపఁజేసిరి. యుద్ధకాలమున లంచగొండితనము దొంగవర్తకము మున్నగునవి దేశమందు విస్తరించినవి. అందుచే జనులు చాల కలవరముజెందియున్నారు ప్రజలకు భీతావహస్థితిఁ దొలగించి, శాంతిస్థైర్యములఁ జేకూర్చవలసిన బాధ్యతయుఁ బరిపాలకులదే. ఈ విషయమునను నెహ్రూమంత్రివర్గ మప్రమత్తతతోఁ బ్రవర్తింపవలసివచ్చినది.

ఇట్టి విషమసమస్యల నన్నిటినీ మిక్కిలి ధైర్యముతోను, నేర్పుతోను, జవహర్లాలు పరిష్కరించుటకు సర్వవిధముల యత్నములు జరుపుచున్నాఁడు. 1938 వ సంవత్సరమున రాష్ట్రములందు కాంగ్రెసు మంత్రివర్గము లేర్పడినపుడు జాతీయాభివృద్ధిని నిర్ణీత కార్యక్రమము ననుసరించి జరపుటకొక ప్రణాళిక యవసరమయ్యెను. ఆ సమయమున జవహర్లాలు యధ్యక్షతక్రింద నేషనల్ ప్లానింగ్ కమిటీ యేర్పరుపబడెను. పరిశ్రమలు, ఆహారోత్పత్తి, విద్యుచ్ఛక్తి, ఖనిజములు

విజ్ఞానశాస్త్రము - ఇట్టి వివిధ విషయములందు దేశాభివృద్ధి యెట్లు జరుగదగునో సూచించు ప్రణాళిక నిర్మించుట యీ సంఘపు యుద్దేశము. జవహర్లాలు తదేకదీక్షతోఁ దనకర్తవ్యమును సాగించుచుండెను. కాని తర్వాత జరిగిన రాజకీయ పరిణామములచే నది పూర్తిగాకపోయినను యతనికా విషయము లన్నియుఁ గరతలామలకములై వానియన్నిటియందును మంచి పరిజ్ఞాన మేర్పడినది. దానినిబట్టి తన ప్రధాన మంత్రిపదవిలో దేశాభివృద్ధికరములగు ననేక కార్యకలాపముల నతఁడు నైపుణ్యముతో నడుపఁగల్గుచున్నాఁడు.

ప్రపంచరాజ్యముల కుటుంబములో భారతదేశ మొక అంగము. కనుక వివిధ రాజ్యములతో సహకారము, మైత్రి అన్యోన్యభావము మున్నగువానివలననే భారతదేశము లోకమునం దుచితస్థానము నాక్రమింపఁగలదని జవహర్లాలు ప్రధానాశయము. తన యాశయసిద్ధికై జవహర్లాలు ప్రధానమంత్రి కాగానే వివిధ రాజ్యములతో సంపర్కము గల్గియుండుటకై నాయాదేశములలో రాయబారులను నియమించి, యా దేశపు రాయబారులకు మనదేశమున స్వాగతమిచ్చెను. ఈ రాజనీతి మన దేశపు ప్రతిష్ఠయు, ప్రతిపత్తియు నినుమడించుట కెంతయో తోడ్పడినది. వ్యాపార విషయములందా యా రాజ్యములతో నొడంబడికలు కుదురుటచే మనదేశపు యెగుమతి దిగుమతులకు చాల సౌకర్యము లేర్పడినవి. ప్రజ్ఞాధురీణులగు మన రాయబారు లాయారాజ్యములలో శ్లాఘనీయగు కార్యక్రమము కొనసాగించుచున్నారు. అమెరికాలో జవహర్లాలు సోదరియగు శ్రీమతి విజయలక్ష్మిపండిట్,

రష్యాలో సుప్రసిద్ధతత్త్వవేత్తయగు రాధాకృష్ణన్, బ్రిటనులో రాజకార్యప్రవీణుడగు కృష్ణమీనను - ఇట్టి మహనీయు లింక నెందరో వివిధరాజ్యములలో మనదేశపు రాయబారులుగ నున్నారు.

స్వాతంత్ర్య మవిభాజ్యమైనదని జవహర్లాలు దృఢ విశ్వాసము. అనగా లోకమునం దన్నిజాతులును స్వాతంత్ర్య సుధను గ్రోలవలెను. ఏ యొక దేశము పరాధీనతలో నున్నను లోకమున స్వాతంత్ర్యము లేనట్లే యని యతని భావము. అందుచే ఇండోనీషియా, వియట్‌నాం, బర్మా మున్నగు దేశములందలి ప్రజల స్వాతంత్ర్యోద్యమములలో జవహర్లా లుత్సుకతను జూపుటవలన నతనియందు లోకములో నన్ని జాతులవారికిని నమితగౌరవ మేర్పడినది. ఈవిషయ మతని పదవినిర్వహణమున కెంతయో విజయోత్పాదకముగ నున్నది.

జాతీయప్రభుత్వభారమును వహించినతోడనే ఆసియా ప్రజలలో నేకీభావము గుదుర్చుటకు జవహర్లాలొక 'అఖిల ఆసియామహాసభను' ఢిల్లీనగరమునసమావేశపరచెను. ఆసియా దేశములు పాలితజాతులనియు, ఐరోపావారి నాగరికతవలననే యవి ముందునకు రావలసియున్నవనియు, నందుచే నాసియా దేశము లెల్లపుడును ఐరోపావారి చెప్పుచేతులలో మెలగవలె ననియు పాశ్చాత్యులు ప్రచారముచేయుచుండిరి. అట్టి ప్రచారము మిథ్యావాదమని నిరూపించి, ఆసియాదేశముల ప్రాచీనౌన్నత్యమును ప్రస్ఫుటము చేయుటయు, ఆసియారాజ్యముల ఆర్థికసంబంధములు సరిపెట్టుకొని పరస్పరసహకారముతో నభ్యుదయము చెందుటయు ఆశయములుగ నుంచుకొని

జవహర్లాలు అఖిల ఆసియామహాసభను జయప్రదముగ నిర్వహించెను. ప్రాచీనభారతపు ఋషులును, శ్రమణకులును చీనా, జావా మొదలు సిరియా, ఈజిప్టులవరకు విశ్వప్రేమసందేశమును, విజ్ఞానకళాశిల్పములను వ్యాపింపఁజేసి ధర్మవిజయము సాగించినవిధమును, దానికి ఫలితముగ ఆసియాలో వివిధ దేశముల సంస్కృతు లుచ్చస్థితిబొందిన పద్ధతియు వివరించి, తిరిగి ఆసియారాజ్యములు సర్వతోముఖమగు సమన్వయముఁ బొందవలసిన సమయ మాసన్నమైనదని జవహర్లాలాసభలో నుద్బోధించెను. ఆయా దేశముల ప్రతినిధులు జవహర్లాలు ప్రతిభకు ముగ్ధులగుటయేగాక నతని విశాలభావములచేఁ బ్రేరితులై ఆసియా యభ్యుదయమునకుఁ గృషిచేయఁ గృతనిశ్చయులైరి.

1948 వ సంవత్సరము చివరభాగమున లండనులో జరగిన అధినివేశమంత్రులసభలో జవహర్లాలు పాల్గొని భారతదేశమునకు బ్రిటిషుసామ్రాజ్యసంబంధము సాధ్యమైనంత తక్కువగనుండు సూత్రము నన్వేషించి మనదేశము చిరకాలముననే రిపబ్లిక్ (గణప్రభుత్వము)గా పరిగణింపఁబడుటకు మార్గ మతఁ డేర్పాటుచేసియున్నాఁడు. జవహర్లాలునందలి గౌరవవిశేషముచే అమెరికా అధ్యక్షుఁడగు ట్రూమన్ ప్రత్యేకాహ్వానము పంపగా అక్టోబరు (1949) నెలలో అమెరికా సంయుక్తరాష్ట్రములలోను, కెనడాలోను పర్యటనము జరుపుటకు జవహర్లాలు పయనమయ్యెను. ఆ దేశముల ప్రభుత్వమువారు, విశ్వవిద్యాలయముల అధికారులు, ప్రజలు వీరు వారననేల? అచటివా రందరును జవహర్లాలునకు బ్రహ్మాండ

మగు స్వాగతమొసంగ నుత్సహించి యుండిరి. జవహర్లాలు అమెరికా యాత్రావిశేషములు వేరొక ప్రకరణమునఁ దెలిసికొందము.

---

## 29 జవహర్లాలు భావములు : సాహిత్యరచన

జవహర్లాలు జన్మించుసరికి అతని తండ్రి మోతీలాలు విశేషముగ ధనమునార్జించుచు, విలాసముగ కాలముగడుపుచుఁ బాశ్చాత్య వేషభాషల నవలంబించుచు, నాంగ్లమిత్రులతో నాహారవిహారముల, జరపుచుండెను. జవహరు బాల్యము సకల సౌకర్యములతోఁ గడచెను. ఆంగ్లేయదాదులు విద్య నేర్పిరి. పదునొకండేండ్లు వచ్చువరకును తలి దండ్రులకు జవహర్లాలొక్కఁడే సంతానము. అందుచే నతఁడల్లారు ముద్దుగాఁ బెరిగెను. ఈఁత, గుఱ్ఱపుస్వారి మున్నగు శరీర పరిశ్రమలయందును బాల్యమునుండి యతఁడు తరిఫీదు పొందెను. పండ్రెండేండ్ల వయస్సున నొక గొప్ప జ్ఞానియగు దివ్యజ్ఞాన ప్రచారకునివద్ద విద్య నభ్యసించెను. సాహిత్యమును శాస్త్రమునేగాక ఉపనిషత్తులను, భగవద్గీతను, ధర్మపథమును, గ్రీకు తత్వగ్రంథములను గూడ నప్పటికే జవహర్లాలు చదివెను. అప్పటికే యతనికి గ్రంథాభిరుచియు, సౌమ్య జీవనమును, సత్ప్రవర్తనయు నలవడెను. దివ్యజ్ఞానసమాజపు అధ్యక్షురాలగు శ్రీమతి అనీబిసెంటు ప్రతిభ, వాగ్ధాటి, చర్చాధోరణి మున్నగునవి యా బాలుని మనసున నప్పుడే నాటుకొనినవి.

మన దేశము పూర్వ మున్నతస్థితిలో నుండెననియు, మన జాతి యాత్మగౌరవము నిలుపవలెననియు జవహర్లాలు వయసుననే గుర్తించెను.

పదునైదవయేట జవహర్లాలు ఇంగ్లండున విద్యాభ్యాస మారంభించినపిదప పాశ్చాత్య సంస్కృతితత్త్వమును గ్రహించి వ్యక్తివికాసము చెందుటకు ఐరోపా విజ్ఞానమే తోడ్పడునను నభిప్రాయము నేర్పరచుకొనెను. కాని మన దేశమునకుఁ దిరిగి వచ్చి మన ప్రజల ఆర్థికదుస్థితిని పరిశీలించినపిదప సామ్యవాదమే సమాజమునందలి యనర్థములను తొలగించుటకు సాధనమని విశ్వసించెను. సాధారణముగ నితర సామ్యవాదులకును జవహర్లాలునకును ముఖ్యభేద మేమనగా నతఁడు తన సామ్యవాదసిద్ధాంతముల నాచరించిచూపెను. విశేషముగ ధన మార్జించుటకుఁ గల న్యాయవాదవృత్తిని వదలి ప్రజాసేవకుఁ బూనుకొనెను. అంతేగాక లక్షలకొలఁది ధనాదాయము గల తండ్రినిగూడ విత్త సముపార్జనకు విముఖునిఁజేసెను. సకలసౌఖ్యముల ననుభవించుచు హంసతూలికాతల్పములపైఁ బరుండుటఁ కవకాశముండగా నట్టి జీవితమును వదలి జెయిలునందే జీవితమున సుమారిరువదియేండ్లు గడపి కఠోరమగు బాధలతోఁ గూడిన ప్రజాహిత జీవితవిధానము నవలంబించెను. లక్షల కొలది రూప్యములు వెచ్చించి నిర్మించిన ఆనందభవనమును తండ్రిచే కాంగ్రెసున కర్పణజేయించెను. అయినప్పటికిని జవహర్లాలు కేవలము విరాగి కాఁడు. ధనసంపాదన ప్రయత్నములో నెట్టిలోపమును లేదనియే యతని యభిప్రాయము.

జవహర్లాలు గాఢమగు స్వదేశభక్తిగలవాఁడు. దేశము కొఱకెట్టి త్యాగమునైనను చేయును. అట్లని కేవలము ప్రాంతీయాభిమానము గలవాఁడుకాఁడు. ప్రపంచమంతయు నొక్కే కుటుంబమనియు, లోకమునందితర దేశములతో మనము పూర్తియగు సంపర్కము గలిగియుండవలెననియు నభిలాష గలవాఁడు. జాతీయత అంతర్జాతీయ భావమున కడ్డుదగలరాద నియు, మన సమస్యలన్నియు విశాలమగు నంతర్జాతీయ తత్త్వముతోఁ బరిష్కరింపఁదగుననియు నాతఁ డెల్లపుడు నుద్బోధించును.

జవహర్లాలు పాశ్చాత్య విజ్ఞానసారమును బాగుగ గ్రోలినవాఁడు. కాని ప్రాచ్యసంస్కృతియందును పూర్తియగు నాదరాభిమానములు గల్గియున్నాఁడు. భగవద్గీత, ఉపనిషత్తులు మున్నగు నుత్కృష్టగ్రంథములందలి తత్త్వమంతయు పరిపూర్ణముగ నవగాహన చేసికొనియున్నాఁడు.

మనదేశము పాశ్చాత్యదేశములవలె యాంత్రిక పరిశ్రమల నభివృద్ధిచేసికొని వాని ప్రయోజనము లన్నియుఁ బొందవలెనని జవహర్లా లాశించును. అట్లని కుటీరపరిశ్రమల నీసడింపఁడు. ఎన్నియేండ్లో అతఁడు చరఖాసంఘపు డైరెక్టరుగఁ బనిచేసెను. మన జాతీయ పరిస్థితులకు గ్రామ పరిశ్రమాభివృద్ధి యెక్కువ ప్రయోజనకారియనియు, మన ఆర్థికదుస్థితిని తొలగించుటకుఁ గుటీరపరిశ్రమలు తోడ్పడును గాన నందులకు వాని నుపయోగించుకొనుచు యంత్రములవలనఁ బడయు లాభములనుగూడ పూర్తిగ బొందవలెననియు జవహర్లాలు భావము.

ఇక మతవిషయము జూచినచో జవహర్లా లెన్నఁడును దేవాలయములకుబోయిదేవాత్మ ప్రార్థనచేయుటగాని,పుణ్యము కొరకు గ్రంథపారాయణము జరుపుటగాని, ప్రార్థన గీతముల బాడుటగాని చేయఁడు. లాంఛనములతోను,మూఢవిశ్వాసముల తోను గూడిన కొన్నిసూత్రములు మతమని యాతం డంగీకరింపఁడు. విశ్వప్రేమ, మానవసేవ, సమభావము— ఇట్టివాని నాచరించుటయే మతమని యాతనిభావము. జవహర్లాలునకు మత శ్రద్ధలేదని కొందరుతలంతురు. కాని మనపూర్వుల యాధ్యాత్మికోన్నతి నతఁడు పరిపూర్ణముగ దన గ్రంథములలోఁ బ్రతిపాదించి యున్నాఁడు.

గాంధిమహాత్ముఁడు బోధించిన అహింసా సూత్రమునందతనికి గొంతవరకే విశ్వాసముగలదు. నిరాయుధులగు ప్రజలు సాయుధుల నెదుర్కొనుట కహింస యొకసాధనమని యాతఁడు గుర్తించెను. కాని అహింసాసూత్ర మెల్లవేళలయందును నాచరణీయముగాదనియు,హింసతో నావరింపఁబడియున్న నేటి ప్రపంచమున దేశరక్షణను బలప్రయోగముచేతనే సాధింపవలెననియు జవహర్లాలు నమ్మకము.

ఇట్లు జవహర్లా లేవిధముగఁ జూచినను సమన్వయకర్తయని గోచరించును. ప్రాక్పశ్చిమసంస్కృతులు, జాతీయతాంతర్జాతీయతలు, యాంత్రిక కుటీర పరిశ్రమలు, హింసాహింసలు, ధనిక సామ్యవాదములు — ఇట్టిపరస్పర విరుద్ధవిషయములు (ద్వంద్వములు) అన్నింటిలోను జవహర్లాలు భావములు సమ్మేళన తత్త్వమునే ప్రదర్శించును.

జవహర్లాలునకు సాహిత్యవిషయమునను శాస్త్రవిష యములందునుగూడ సమానాదరమే విద్యాభ్యాసకాలమున నతఁడు ప్రకృతిశాస్త్రములను పఠించి ఎం. ఏ. పట్టముపొందెను. పిదప సాహిత్యవిషయములందును చారిత్రకాంశములలోను కృషిచేసి సుశిక్షితమగు పరిజ్ఞానము పొందఁగలైను. ఆతని రచన లన్నియు చాలవరకు చారిత్రక విషయములకు సంబంధించి నవి. ఇప్పటికిని తరచుగ శాస్త్ర, సాహిత్య, చారిత్రిక విష యములనుగూర్చి జరగు సాంవత్సరిక సమావేశముల కాతఁ డధ్యక్షతవహించుచుఁ గూలంకషముగ వివిధాంశములను చర్చించుచు నుపన్యాసము లిచ్చుచుండును.

జవహర్లాలు ప్రజల హృదయములను చూరగొనున ట్లుపన్యసించు వాగ్ధోరణి గలవాఁడు. చిన్న వాక్యములతోనే పటుత్వమును, ఉద్రేకమును, ఉదాత్తభావములను నతఁడు ప్రదర్శింపఁగలఁడు. అతని యాంగ్లభాషాశైలి కాంగ్లేయులు గూడ ముగ్ధులై, ఆశైలి ననుకరింపఁజూచువారు కొందరుగలరు.

సాహిత్యరంగమున జవహర్లాలున కుచ్చస్థానముగలదు. అతని కారాగారనివాసము సాహిత్యాభివృద్ధికి మిగులఁదోడ్పడి నది. ఉప్పుసత్యాగ్రహపు రోజులలో 1930 వ సంవత్సర మున జవహర్లాలు జెయిలులో నుండగా 'కుమార్తెకు తండ్రి లేఖలు' అని యెనిమిదేండ్లవయస్సుగల తన పుత్రికయగు యిందిర పేర కొన్ని లేఖలు వ్రాసెను. ఇందు భూతలముయొక్క నిర్మాణవిధానము, జీవముల పుట్టుక, పెరుగుదల, మానవజాతి

పరిణామము – ఇట్టివిషయములు విస్పష్టముగ సరళమగు శైలిలో వివరింపఁబడియున్నవి. బాలురకుఁగూడ సుబోధక రీతిని నీచిన్నపొత్తము వ్రాయఁబడుటచేఁ జాలమనోరంజ కముగ నున్నది. 1932 వ సంవత్సరము జెయిలునివాసములో గ్లింప్సెస్ ఆఫ్ వర్ల్డ్ హిస్టరీ యను పేరుతో ప్రపంచ చరిత్ర ప్రాచీనకాలమునుండి నేటివరకుఁగల పరిణామములు – కుమార్తెకు లేఖలరూపమునసే రచించిరి. ఆ లేఖలన్నియుఁ జేరి యొక పెద్ద యుద్గ్రంథమైనది. ప్రాచ్యదేశముల చరిత్రకుఁ గూడ నుచితస్థానమును యీ గ్రంథమున నెహ్రూ యొసంగి యున్నాఁడు. 1934 వ సం॥మున జైలులో నున్నపుడు జవహ ర్లాలు తన ఆత్మకథ (ఆటోబయాగ్రఫీ) రచించియున్నాఁడు. ఇది ప్రచురింపబడిన సంవత్సరమున నాంగ్లసాహిత్యములో నాయేఁడు ప్రకటింపబడిన మరి యే గ్రంథముకంటెను గూడ నెక్కువప్రతు లమ్ముడుపోయెనని ప్రఖ్యాతినందెను. ఇందు నెహ్రూకుటుంబపు చరిత్రతోఁబాటు జాతీయోద్యమపు చరి త్రయు విస్పష్టమగుచున్నది. జవహర్లాలు వ్యాసములు, లేఖలు మున్నగునవి గ్రంథరూపమున వెలువడినవి. 1942 వ సంవత్స రమునుండి 1944 వ సంవత్సరము వరకు జవహర్లాలు అహమదునగరుకోటలో నిర్బంధమున నున్నపు డతఁడు మరి యొక యుద్గ్రంథమును వ్రాసెను. అదియే 'డిస్కవరీ ఆఫ్ ఇండియా (భారతీయాభిజ్ఞానము)' దీనియందు ప్రపంచసమస్య లనేకములు చర్చించుట యటుండ భారతదేశపు సంస్కృతి పరిణామములు వివిధకాలములలో నెట్లు జరిగినవో మనోరంజ కముగ వివరింపఁబడినవి.

ఈవిధముగ జవహర్లాలు తన సర్వతోముఖమగు రచనలచే విజ్ఞానమునకును సాహిత్యమునకును నపారమగు సేవ యొనర్చుచున్నాఁడు.



## 30. అమెరికా యాత్ర

అమెరికాసంయుక్తరాష్ట్రముల కధ్యక్షుఁడగు ట్రూమను తమ దేశమును సందర్శింపఁగోరుచు పండిత జవహర్లాలు నెహ్రూకు 1949 వ సంవత్సరము జూన్ నెలలోనే ఆహ్వానమును పంపియుండెను. నెహ్రూపండితుఁ డందుల కంగీకరించి అక్టోబరు 5 వ తేదీని అమెరికాకు ప్రయాణోన్ముఖుఁడయ్యెను. అమెరికాలోఁ దా నవలంబింపవలసిన కార్యక్రమమునుగూర్చి తన సహచరులగు మంత్రివర్గసభ్యులతోను, కాంగ్రెసువర్కింగ్ కమిటీసభ్యులతోను చర్చించి వారి యనుమతిని ఆశీస్సులనుఁ బొంది ఢిల్లీనగరమున పాలం విమానాశ్రయమునుండి బయలుదేరి, పూనాఁ జేరి యచట ఖడక్వాస్ల యను స్థలమున జాతీయ రక్షణ పరిషత్తునకు శంఖుస్థాపనను జరపెను, అనంతరము మలబార్ ప్రిన్సెస్ అనుపేరుగల ఎయిరిండియా ఇంటర్నేషనల్ కంపెనీవారి విమానములో బొంబాయిమీదుగా కైరో, జినివానగరములందు కొలఁది విశ్రాంతిఁగైకొని 8 వ తేదీని లండనునగరమున నెహ్రూపండితుఁడు దిగెను. అచట మూఁడు దినములుండి యాయన బ్రిటిషుప్రధానియగు అట్లీ, బ్రిటిషు

ఆర్థికమంత్రియగు సర్ స్టాఫర్డ్ క్రిప్సు మొదలగు రాజకీయవేత్త లతో నిష్టాగోష్ఠి జరపెను.

అమెరికా యధ్యక్షుఁడగు ట్రూమనునకు బహుమతి యిచ్చుటకై మైసూరునందుఁ జేయఁబడిన యొక దంతపుపెట్టెను పండిత నెహ్రూ తన వెంటఁ దీసికొని వెడలెను. ఈ పెట్టెకు నాల్గు ముఖములయందును రామాయణము, మహాభారతము, భాగవతము, భగవద్గీతల యందలి ఘట్టములు చిత్రింపఁబడి యున్నవి. పండిత నెహ్రూ లండను చేరుసరి కాయనను అమెరికా సంయుక్తరాష్ట్రముల రాజధానియగు వాషింగ్టను నగరముకుఁ గొనిపోవుటకై ట్రూమను ఇండిపెండెన్సు అను పేరుగల తన సొంత విమానమును లండను నగరమునకుఁ బంపెను. తన పుత్రికయగు శ్రీమతి ఇందిరాగాంధితోఁగూడ నెహ్రూపండితుఁడు అక్టోబరు 11 వ తేదీ ఉదయము లండను నగరమున బయలుదేరి యా సాయంకాలమునకు వాషింగ్టను జేరెను.

అప్పటికి ట్రూమను అధ్యక్షుఁడును, అతని మంత్రివర్గమును, ఆహ్వానసంఘమువారును అమెరికాయందు భారత రాయబారియు నెహ్రూపండితునిసోదరియు నగు శ్రీమతి విజయలక్ష్మీపండిట్ యు నెహ్రూపండితునికొరకు నేషనల్ ఎయిర్ పోర్టు విమానాశ్రయమువద్ద నిరీక్షించుచుండిరి. భారత ప్రధాని పయనము చేయుచుండిన ఇండిపెండెన్సు విమానము క్రిందకు దిగగానే యాయన గౌరవార్థము పందొమ్మిదిసార్లు ఫిరంగులు పేల్చబడెను. అమెరికాప్రభుత్వము పక్షమునను ప్రజల పక్షమునను ట్రూమను అధ్యక్షుఁడు నెహ్రూపండితు

నకు స్వాగతవచనములు పలికినమీఁదట భారతప్రధానియుచిత రీతిని ప్రత్యుత్తర మొసఁగెను. అమెరికా జాతీయగీతమును భారతజాతీయగీతమును పాడఁబడినపిదప, నమెరికనుప్రజలు భారతనాయక శ్రేష్ఠున కత్యుత్సాహముతో నఖండస్వాగతము నులాంఛనయుక్తముగ నొసఁగిరి. అంతట భారతప్రధానిని అమెరికా యధ్యక్షుఁడు తన స్వగృహమగు బ్లేయర్ హౌసున కతిథిగఁ దోడ్కొని చనెను. మరుచటి మూఁడుదినములును నెహ్రూపండితుడు అమెరికారాజ్యాంగకార్యదర్శియగుఏక్‌సన్, ట్రూమన్ అధ్యక్షుఁడు మున్నగువారితో విందులుగుడిచి యిష్టాగోష్ఠిసభలు జరపెను. జవహర్లాలు గుణగణముల నుగ్గడించుచు ఏక్సను భారతప్రధాని రాజ్యాంగవేత్తలలోఁ బండితుఁడని వక్కాణించెను.

అక్టోబరు 13 వ తేదీన నెహ్రూపండితునకు అమెరికను కాంగ్రెసులో నుపన్యసించు గౌరవము గల్గెను. భారతదేశపు శాంతిసందేశము నమెరికాప్రజాప్రతినిధిసభలో పండిత నెహ్రూ ప్రకటించుచు పరస్పర శ్రేయోదాయకమగు సహకారమును, యాంత్రిక సాంకేతిక సహాయమును విదేశములనుండి స్వీకరించుటకు భారతదేశ మెల్లపుడును సంసిద్ధముగనుండును గాని, యకుంఠితత్యాగఫలితముగ లభించిన స్వాతంత్ర్యము నణుమాత్రమును గోల్పోవుట సహింపనేరదని యుద్ఘాటించెను.

అమెరికాయందు నెహ్రూపండితునకుఁ జరగిన గౌరవము లనేకములు. ఆయన సత్కారమును పురస్కరించుకొని న్యూయార్కునగర పరిపాలక సంఘాధ్యక్షుఁడు బ్రహ్మాండమగు నూరేగింపు నేర్పాటుచేసెను. కొలంబియా విశ్వవిద్యాలయము

నెహ్రూపండితునకు గౌరవ పండితపట్టము నొసంగెను. బోస్టను నగరమందలి భారతీయ విద్యార్థులయెదుట నెహ్రూ పండితుడు ప్రసంగము జరపి భారతదేశపు భావి శ్రేయస్సునకు వారెట్లు తోడ్పడవలసినదియు నుద్బోధించెను.

మొత్తముమీఁద నెహ్రూపండితున కమెరికా సంచారమున విశ్రాంతి యనునది చాల తక్కువగనుండెను. ఆయనకు వచ్చు లేఖలను పరిశీలించుటకును, టెలిఫోను పిలుపులకును, ప్రత్యుత్తరము లిచ్చుటకును సహనశీలురు తొమ్మండుగురు కార్యదర్శులు పనిచేయుచుండిరి. నెహ్రూపండితుఁడు బస చేసిన హోటలులో నాయన ప్రత్యేకోపయోగమునకొఱకు పండ్రెండు టెలిఫోనుయంత్రము లేర్పరుపబడెను. వ్యాపారస్థులు, పత్రికావిలేఖరులు, అంతర్జాతీయ సంస్థల కార్యనిర్వాహకులు, నీగ్రోనాయకులు - ఇట్లు వివిధములగు తరగతులకుఁ జెందినవా రెందరో నెహ్రూపండితుని సందర్శనమున కనుక్షణము ప్రతీక్షించుచుండిరి. ఆయన చిత్తరువులను లిఖించుటకును, ప్రసంగములు గ్రామఫోనులో రికార్డుచేయుటకును, ఆయన జీవిత విశేషములు సేకరించుటకును కొందరు వేచియుండుచుండిరి.

ఇట్లు, అక్టోబరు 22వ తేదీవరకును అమెరికా సంయుక్త రాష్ట్రములలోఁ గడపి, నయాగరా జలపాతమును వీక్షించిన పిదప నెహ్రూపండితుఁడు కెనడారాజ్యమున యాత్ర మొదలిడెను. కెనడా ప్రధాన మంత్రియగు సెంటు లారెంటును, మెకెంజీసింగు మున్నగు ప్రముఖులును నెహ్రూ పండితునకు కెనడా రాజధానియగు అటావాయం దఖండస్వాగత మొసఁగిరి.

కెనడా పార్లమెంటులో భారత ప్రధాని గంభీరోపన్యాస మిచ్చెను. కెనడా ప్రధానియగు సెంటు లారెంటును, నెహ్రూ పండితుఁడును బాల్యమున నింగ్లండునందు సహాపాఠులుగా నుండుట యిచట మరియొక విశేషము. నెహ్రూ పండితుఁడు కెనడాలోని గోధుమపండించు రైతుల గృహములకుఁ బోయి వారి పనిపాట్లు పరిశీలించి వారి యాతిథ్యముఁగూడ స్వీకరించి యానందించెను.

పిదప పండిత నెహ్రూ అమెరికా సంయుక్తరాష్ట్రములకు దిరిగివచ్చి టెన్నెసీవాలీడాం మున్నగు వానిని సందర్శించి, సల్ఫర్ స్ప్రింగ్ వంటి ఆరోగ్యస్థానములోఁ గొంతకాలము గడపి సాన్‌ఫ్రాన్సిస్కో వంటి నగరములలో సంచార మొనర్చెను. సాన్‌ఫ్రాన్సిస్కో నగరమున నెహ్రూ పండితుఁడు పౌరత్వముచే బహూకరింపబడెను. అంతేగాక నచట నెహ్రూ పండితుఁ డితర విధముఁగూడ ననన్యసామాన్యమగు గౌరవముఁ బొందెను. అనంతరము జవహర్లాలు పండితుఁడు కెనడా రెండవసారి సంచారముచేసి, వాంకోవరు నగరస్వాతంత్ర్యముచే గౌరవింపఁ బడెను. నవంబరు 6వ తేదీని న్యూయార్కు నగరమున నెహ్రూ పండితునకు మరియొక యసాధారణ గౌరవము లభించెను. ఆసియా, ఆఫ్రికా ప్రజలకు స్వేచ్ఛ, భద్రత, సౌఖ్యము సంపాదించు నుద్యమమునకు నాయకుఁడై నెహ్రూ పండితుఁడు మానవ సేవాపరాయణత్వమునుఁ జూపుటచే హార్లెంనందలి నీగ్రోలు అమెరికా స్పింగారన్ మెడలును నెహ్రూకు సమర్పించిరి. ఆదినముననె జవహర్లాలు పండితుఁడు ప్రొఫెసరు

ఆల్బర్టు ఈన్‌స్టీను అను ప్రపంచ విఖ్యాతిజెందిన వైజ్ఞానికుని సందర్శించి యొక గంట సల్లాపము జరపెను.

ఇట్లు నెహూ్రు పండితుఁ డమెరికాలో నిరువదియైదు దినములు యాత్రజరపి సుమారు పదివేలమైళ్ళు సంచారము జరపెను. ఈ సంచారమున జవహర్లాలు నూరు బహిరంగోప న్యాసములు జరపి లోకవిఖ్యాతిగల రాజ్యాంగవేత్తయనియు, గాంధిమహాత్ముని యాధ్యాత్మిక వారసుఁడనియు, ప్రబుద్ధా సియా నాయకుఁడనియుఁ బ్రస్ఫుటముజేసెను. నవంబరు 7-వ తేదీని నెహూ్రుపండితుఁడు న్యూయార్కునుండి బయలుదేరి మరునాడు లండనునగరమును చేరెను.

తన అమెరికాయాత్రయొక్క ముఖ్యఫలితము పాశ్చాత్య దేశములకును ఆసియాకును సన్నిహితసంబంధ మేర్పడుటయే యని సూత్రప్రాయముగ నెహూ్రుపండితుఁడు తనసంచారాంత మున నుడివెను. ఈ యాత్రవలన నమెరికను ప్రజల మిత్ర భావమును, పరేంగితజ్ఞానమును ప్రస్ఫుటమయ్యెనసియు, నట్టి సన్నివేశములోఁ దన యాత్మపరిశోధన యొనర్చుటకునుఁ దన కవకాశమేర్పడెననియు పండితుఁడు పత్రికావిలేఖరులగోష్ఠిలో ప్రసంగించెను.

నవంబరు 7 వ తేదీ మధ్యాహ్నము న్యూయార్కు విమానాశ్రయమువద్ద శ్రీ విజయలక్ష్మిపండిట్, అమెరికను రాజ్యాంగపుటుద్యోగులు, సంయుక్తజాతి ప్రతినిధులుమున్నగు ప్రముఖుఁ వీడ్కోలొసంగగా శ్రీమతి ఇందిరాగాంధితోఁ గూడ పండిత జవహర్లాలు నెహూ్రు ఇండిపెండెన్సు విమాన ములో బయలుదేరి మరునాటికి లండనుచేరెను. అచట నాల్గు

దినములుండి అట్లీ, క్రిప్సు, బెవిను, ఈడెన్, క్రిష్ణమీనన్ మున్నగు ప్రముఖులతో ప్రధాన రాజకీయసమస్యలనుగూర్చి సంభాషణలు జరపెను.

పండిత జవహర్లాలు నెహ్రూకు వీడ్కోలొసంగుసందర్భమున న్యూయార్కు టైమ్సుపత్రిక సంపాదకీయ వ్యాసమున నిట్లు వ్రాయఁబడెను.

“భారత ప్రధానియగు పండిత జవహర్లాలు నెహ్రూ అమెరికా సంయుక్తరాష్ట్రములలోఁ గావించిన కొలఁదికాలపు పర్యటనానంతరము నిన్న మధ్యాహ్నము అమెరికను ప్రజలాయనకు వీడ్కోలొసఁగిరి. ఇట్టి మైత్రిభావసమన్వితమగు యాత్ర లితోధికముగ జరుగఁదగునని అమెరికను ప్రజల ముఖ్యాభిలాషమై యున్నది. ఈ భారత రాజ్యాంగవేత్తతో గలసిమెలసి సంచరించుట యిచ్చట ప్రజలందరకు నెంతో ముదావహముగా నున్నది. తిరిగి యనతికాలముననే నెహ్రూ మహాశయుఁ డమెరికాకు రాగలఁడని యమెరికా ప్రజలు నిరీక్షించుచుందురు. ఇచటనున్న కాలమున నాయన యానందముగ గడపఁగల్గెనని మేము విశ్వసించుచున్నాము. రాజకీయ కార్యక్రమపు తొందరలో నాయన యిచట చూడఁదలచినదంతయుఁ జూచుట కాటంకము గలుగలేదని మే మాశించుచున్నాము. అమెరికను ప్రజలనుండి జ్ఞానసముపార్జన చేయఁదలచుచున్నానని నెహ్రూపండితుఁడు చెప్పియుండెను. కాని ఆయనవలనఁ గొన్ని విషయములు తెలిసికొనవలెనని మే మభిలషించుచుచున్నాము, మావలెనే యీయనగూడ లోకమున సుఖమును, స్వేచ్ఛయు పెంపొందింపఁ దలచుచున్నాడు. పరస్పర సహ

కారమువలన నట్టి మహదాశయము సుకరముగ నెరవేరఁగల దనుట నిస్సంశయము. అందుచేఁ, బండిత నెహ్రూమహాశయా! త్వరలో నిచటికిఁ దిరిగి వచ్చెదవుగాక! నీ కెల్లపుడును సుస్వాగతము! అని అమెరికను ప్రజ తెలుగెత్తి పలుకుచున్నారు."

లండనునుండి విమానములో 13 వ తేదీని బయలుదేరి నెహ్రూ మార్గమధ్యమున కెయిరో మొదలగు నగరములలోఁ గొలఁదికాలము విశ్రాంతికై గడపి నవంబరు 14 వ తేదీ సాయంకాలము నాలుగున్నరగంటలకు బొంబాయి శాంతాక్రుజ్ విమానాశ్రయమును సురక్షితముగఁ జేరెను.

---

## 31. షష్ఠిపూర్తి

పండిత జవహర్లాలు నెహ్రూ బొంబాయికిఁ దిరిగివచ్చిన శుభదినమున నా మహామహుని షష్ఠిపూర్త్యుత్సవ మతివైభవముతో జరుపుట కేర్పాట్లు చేయఁబడెను. బొంబాయి గవర్నరగు మహారాజ్‌సింగు, బొంబాయి రాష్ట్రప్రధాని యగు బి. జి. ఖేర్ మున్నగు ప్రముఖులు విమానాశ్రయమున నెహ్రూ పండితునకు బ్రహ్మాండమగు స్వాగత మొసఁగిరి.

ఆ సమయమునకు ప్రపంచమున వివిధదేశములందలి ప్రముఖులనుండి నెహ్రూ పండితునికి జన్మదినోత్సవసందర్భమున శుభాశిస్సులు చేరినవి. పిదప జరగిన బ్రహ్మాండమగు బహిరంగసభలో పండిత జవహర్లాలునకు బొంబాయి ప్రజలొక యమూల్యమగు బహుమతి నొసఁగి సత్కరించిరి. ఆ బహూ

కృతి దిగువ వర్ణింపఁబడినరీతిని సిద్ధపరుపఁబడెను. రెండువందల ముప్పదియైదుతులముల బంగారముతోఁ బంద్రెండుతులముల ప్లాటినము మిశ్రముచేసి పంద్రెండంగుళముల యెత్తుగల యొక అశోక స్తంభపు ప్రతిమ నిర్మింపఁబడెను. అశోకచక్రమంతయు వజ్రములతో బొదుగఁబడెను. ఇంకను సుమారు మూఁడు వందల వజ్రములు అశోక స్తంభముపై నమర్పఁబడినవి. ఈ యశోక స్తంభ ప్రతిమవిలువ సుమారు అరువదివేలరూపాయలుండునని మదింపువేయఁబడినది.

నెహ్రూ షష్టిపూర్త్యుత్సవమునకు బొంబాయిపౌరులు సుమారొక లక్షరూపాయలు విరాళములు సేకరించిరి. అశోక స్తంభప్రతిమయు, మిగిలినధనమును షష్టిపూర్త్యుత్సవసంఘమువారు పండిత నెహ్రూకు సమర్పింపఁగా నాయన యా బహుమతిని స్వీకరించినపిదప సంఘమువారి నీ విధముగఁ గోరెను. ఆయమూల్యప్రతిమను విక్రయింపఁగా వచ్చిన ధనమును మిగిలియున్న రొక్కపుధనమునుఁ గలిపి యీ మొత్తమును జాతీయ నిర్మాణ కార్యక్రమములకు వినియోగించుట యుచితమని నెహ్రూపండితుఁడు తన యుద్దేశ్యమును బహిర్గత మొనర్చెను.

తర్వాతఁ గొన్నిదినములలోనే ఢిల్లీనగరమున నెహ్రూ అభివందనసంఘమువారు రెండులక్షలరూపాయలు వెచ్చించి రమారమి వేయిపుటలుగల షష్టిపూర్తిసంచికను సిద్ధపరచి పండిత జవహర్లాలు నెహ్రూకు సమర్పించి యాయనను బహూకరించిరి.

పండిత జవహర్లాలు జీవితము పరమోత్కృష్టమైనది. ఆ మహనీయుని జీవితమొక గొప్పపరిణామమును, సమన్వయ

మును ప్రదర్శించుచున్నది. ఇది యేపండితజవహర్లాలునెహ్రూ జీవితమునందలి ప్రత్యేకవిశిష్టతయై యున్నది.

జవహర్లాలు బాల్యమునుండియు విదేశీయులవద్దను, విదేశములలోను విద్యాభ్యాసమొనర్చి, పాశ్చాత్యసంస్కృతిని గోరి యందలిసారము నిముడ్చుకొనినను, కాలక్రమమున భారతీయవిజ్ఞానము నభిజ్ఞానముబొంది ప్రాక్పశ్చిమసంస్కృతులకు సమన్వయకర్తగ వెలయుచున్నాఁడు. ప్రాచీన సాంప్రదాయములుగల కాశ్మీరపండిత వంశమున జన్మించినను అతఁడు సంఘసంస్కరణమునందు ముందంజవైచి పురోగామి మార్గము నవలంబించుచున్నాడు. బ్రిటను, అమెరికాలవలె భారతదేశముగూడ యాంత్రిక పరిశ్రమాభివృద్ధిని బొందుట నేటి పరిస్థితులలో నవసరమని గుర్తించినను, గ్రామపరిశ్రమలు పెంపొందుటగూడ మన దేశీయుల బీదరికము తొలఁగుట కవసరమనియే నెహ్రూపండితుని విశ్వాసము. ఆగర్భశ్రీమంతుఁడయ్యు నిష్టనష్టములకోర్చి ఘనత్యాగ మొనర్చెనుగాని నెహ్రూ పండితుఁడు విరాగి కాఁడు. న్యాయమగుకృషిచే ధనసముపార్జన మొనర్చుట మానవులకు విధాయకమేయని యాయన తలంపు. పాశ్చాత్యనాగరికతావిముఖుఁడగు గాంధిమహాత్ముని ధర్మపుత్రుఁడయ్యును ఆధునిక జీవితసౌకర్యములు వినియోగించుకొని దానివలన నుచితమగుప్రయోజనము పొందుటయే కర్తవ్యమని జవహర్లా లుద్దేశించుచున్నాఁడు. సామ్యవాద సిద్ధాంతములందు దృఢవిశ్వాసముగలవాఁడైనప్పటికిని నెహ్రూ పండితుఁడు ధనికవర్గములవారి యాదరమునుగూడఁ జాలగొన గల్గుచున్నాఁడు. మన దేశనాయకులలోఁ జాలమందితో సరి

పోల్చినప్పుడు పండితజవహర్లాలు యువకుఁడేయయ్యు నొకవంక వృద్ధరాజకీయ నేత్తలను తన రాజకీయవిధానముల కంగీకరింపఁ జేసి మరియొకవైపున యువకపక్షమునకును మార్గదర్శియై నెహ్రూ పండితుఁడు మెలఁగుచున్నాఁడు.

నైతిక, సాంఘిక, రాజకీయ ఆర్థిక విషయములందు బహుక్లిష్టసమస్యలతో నిండియున్న నేటిభారతదేశమును — భారతదేశమునేయననేల? లోకము నంతటిని ఋజుమార్గమున నడపి, కల్లోలవీచికాసంక్షుభితమగు పయోనిధియందలి నౌకను సుశిక్షితుఁడగు కర్ణధారివలెఁ గమ్యస్థానమునుఁ జేర్చి విశ్వశ్రేయస్సును చేకూర్చుటకు సర్వవిధముల సమర్థుఁడగు శ్రీ పండిత జవహర్లాలు నెహ్రూకు దీర్ఘాయురారోగ్యములు ప్రసాదించి దయామయుఁడగు భగవానుఁడు లోకకల్యాణము చేకూర్చునుగాక!